శ్రీమతే నారాయణాయ నమః

# భూసూక్త వ్యాఖ్యానము

**తమిళమూలము-శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యఙ్గార్, సుదర్శనపత్రికాధిపతి**

**తెలుగుసేత-డా.ఈ.ఏ. శింగరాచార్యులు, తిరుపతి.**

**అవతారిక:-**

**"లక్ష్మీం విహారరసికా మివ రాజహంసీం ఛాయా మివాభ్యుదయినీ మవనీం చ తస్యాః"** (శ్రీరంగరాజస్తవము పూ-63) (శ్రీ రంగనాథుడను హ్రదములో విహరించుటయందు ఆసక్తినికల, రాజహంసివలెనున్న లక్ష్మీదేవిని, ఆమెకు యొక్క, అభివృద్ధి చెందుచున్న ఛాయవంటి భూదేవిని ఆశ్రయించుచున్నాను) అని, **"భోగ్యావా మపి నాంతరీయకతయా పుష్పాంగరాగై స్సమం నిర్వృత్తప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్, దేవి! త్వా మనునీళయా సహమహీదేవ్య స్సహస్రం తథా యాభి స్త్వం స్తనబాహుదృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"** (శ్రీగుణరత్న) (దేవీ! నీ వెంటనుండువారు, నీ నాథుడగు సర్వేశ్వరునకు పత్నులును అగు భూదేవి, నీళాదేవి మొదలగు వేలాది దేవేరులు, మీ ఇరువురకును పుష్పము, అలంకరణములు మొదలగువానివలె మిమ్ములను విడచియుండని ఉపకరణములవంటివారు, భోగ్యములైయున్నవారు, మీప్రణయరసము ఉత్కటమగునపుడు దానిని వెలువరించు ప్రవాహములవంటివారును. నీవుకూడ నీ స్తనములు, హస్తములు, నేత్రములు మొదలగువానితో నీ నాథుని సంతోషింపజేయునట్లు, వారితోపాటు కలసి సంతోషింపజేయుదువు) అనియును భట్టరు అనుగ్రహించినట్లు భూదేవి లక్ష్మీదేవికి ఛాయవలెను, **"కుళత్తోవలర్మడప్పావైయుమ్ మణ్మకళుమ్ తిరువుమ్ నిళల్ పోల్వనర్"** (పిల్లనగ్రోవిని సూచకముగా గల గోపాలకులములో అవతరించిన అందమైన నీళాదేవి, భూదేవియు లక్ష్మీదేవికి నీడవంటివారు) అనుచు ఈ భావమును నమ్మాళ్వార్లు తిరువిరుత్త ప్రబంధములో వ్యక్తీకరించిరి) స్తన, బాహు, నేత్రములనెడి అవయవములవలెను, పుష్పాంగరాగములనెడి భోగోపకరణములవలె నుందురు. **"సాక్షాత్ క్షమాం కరుణయా కమలా మివాన్యామ్"** (సాక్షాత్తు భూదేవిగను, కరుణచే వేఱొక లక్ష్మీదేవిగను నున్నది) అనుచు వేదాంతదేశికులు గోదాస్తుతిలో అనుగ్రహించినట్లే, లక్ష్మీదేవియొక్క మరియొక అవతారమా! అనునట్లుండునది భూదేవి. మనకు ఆధారమై, నివసించుచోటు అగుటచే ఈమె మనము తెలిసిన తల్లియైయున్నది. అన్నిజాతులకు చెందినవారిచే, అన్ని మతములకు చెందినవారిచే "తల్లి" అని పొగడబడునది. ఈమె లోకములకు తల్లి అయినచో, ఈమె భర్త ఎవడో అతడే లోకమునకు తండ్రి అనునది సుస్పష్టము కదా! భూమినాథుడు అగు నారాయణుడే పరబ్రహ్మమనుటను నిర్ణయించునది, అతడు తన దేవియగు భూదేవిద్వారా మనకందఱకును అన్నమును, ప్రాణములను అనుగ్రహించి, రక్షించుచున్నాడనుటను సుస్థాపించునది, భగవానుడే సర్వరక్షకుడనుటను స్థిరీకరించునదియును అగు ఈ భూసూక్తము వ్యాఖ్యానింపబడుచున్నది. ఈ సూక్తములోని మొదటి ఆఱుమంత్రములు యజుస్సంహిత మొదటికాండము అయిదవ ప్రశ్నలో కలవు. అనంతరము కల పలు మంత్రములు ఖిలమంత్రములు.

ముందుగా భూదేవికిచెందిన వైలక్షణ్య మిచట కించిత్తు విన్నపింపబడుచున్నది. ప్రాణులన్నిటికిని ఆధారమై, తనయందుండుటకు చోటిచ్చి అన్నమును ఇచ్చి, ఆకలిని తీర్చి, వారు చేయు ఉపచారాపదేశములగు అసహ్యాపచారములను సైతము సహించుటయేకాక వారికి అధికాధికముగా ఉపకారములను చేయు ఈమె గొప్పతనమును మనము ప్రతిదినము, ప్రతిక్షణమును ప్రత్యక్షముగా దర్శించుచుంటిమి. క్షమాగుణములో తనకంటె నిస్సమాభ్యధికులు ఎవ్వరును లేనిది ఈమె. **"క్షమా"** అను సార్ధకనామమును కలిగియున్నది ఈమె. సమస్తకల్యాణగుణాత్మకుడగు భగవానుని క్షమాగుణమును వర్ణించునపుడు **"క్షమయా పృథివీసమః"** (క్షమాగుణములో భూదేవికి సాటివచ్చువాడు శ్రీరాముడు) అనుచు ఈమె ఉపమానముగా నిర్దేశింపబడినది. కరుణాస్వరూపిణియగు లక్ష్మీదేవి" **"పాపానాం వా శుభానాం వా వధార్హాణాం ప్లవంగమ, కార్యం కరుణ మార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి"** (వానరా! పాపులైనను, పుణ్యశాలురైనను, వధింపతగినవారైనను వారిపట్ల సత్పురుషుడు కరుణను చూపవలెను. తప్పు చేయనివాడెవడును లేడుకదా!) అనునట్లు దోషమును చూచినను, దానిని క్షమింపవలెను అనుచు వాదించును. ఇక, భూదేవి అన్నచో, "దోషమును చూచుట ఎందులకు? **"ప్రక్షాళనా ద్ధి పంకస్య దూరా దస్పర్శనం వరమ్"** (బురదను కడుగుకొనుటకంటె దానికి దూరముగా నుండుటయే మేలు) అనికదా సూక్తి" అనుచు దోషములను ఏ మాత్రము చూడకుండనుండును. లక్ష్మీదేవి సర్వేశ్వరుని సంపద. భూదేవి ఆ సంపద ఫలించు భూమి. "దోషమును లేనివాడెవ్వడు లేడుకదా!" అని లక్ష్మిదేవి అనగా, "దోషమును చేసినవాడే లేడుకదా!", అని ఈ భూదేవి అనును. నారాయణునకు ఒక్కని శేషభూతయైయుండుటచే మిథునశేషభూతులమగు మనవంటి చేతనులకంటె విజాతీయయైయుండునది లక్ష్మీదేవి. ఇద్దఱికిని శేషభూతలైయున్నవారిలో అగ్రగణ్యయైయుండునదియగు భూదేవియే మనతో మిక్కిలి సజాతీయయైయున్నది. తల్లికి ఉండతగిన వాత్సల్యగుణము శ్రీదేవి కంటె భూదేవియందే శ్రీధికముగానుండుననుట మిక్కిలి విశదము. సర్వేశ్వరునికంటె గుణములలో ఆధిక్యమును కల్గినది లక్ష్మీదేవికాగా, ఆమెకంటెను గుణాధిక ఈ భూదేవి.

**"పెరుమైయుడైయవళ్ పూమకళ్, పొఱుమైయుడైయవళ్ భూదేవి. గుణముడైయవళ్ శ్రీదేవి, మణముడైయవళ్ మణ్మడన్దై. ఘోషిప్పివ్వళ్ శ్రీదేవి పోషిప్పవళ్ భూదేవి. అళకుడైయవళ్ ఇలక్కుమి, పుకళైయుడైయవళ్ భూదేవి. ఆదరముడైయవళ్ అలర్మేల్మఙ్గై ఆధారమానవళ్ అవనియాళ్"** (గొప్పతనమును కల్గినది లక్ష్మీదేవి, క్షమను కల్గినది భూదేవి. గుణాలను కల్గినది శ్రీదేవి సౌగంధ్యమును కల్గినది భూదేవి. ఘోషింపజేయునది శ్రీదేవి,

పోషించునది భూదేవి. అందమును కల్గినది శ్రీదేవి, కీర్తిని కల్గినది భూదేవి. ఆధారమైయున్నది భూదేవి) అనియును, **"పూమిప్పిరాట్టిక్కు నామ్ శెయ్యుమ్ కుత్తజ్గళుక్కోర్ కణక్కిల్లై. అవళ్ నమక్కు చ్చెయ్యుమ్ నన్మైకళుక్కోర్ ఎల్లైయిల్లై. నామ్ ఉణ్డావదఱ్కు ఉదవుకిఱాళ్. నామ్ నడక్కుమ్బోదుమ్, కిడక్కుమ్బోదుమ్ నమ్మై తాఙ్గుకిఱాళ్. ఉయిరుడనిరుప్పదఱ్కు వేణ్డియవైకళై కొడుత్తు కాపాత్తుకిఱాళ్. నామ్ అదఱ్కు బదిల్ అవళై వెట్టుకిఱోమ్. మలజలాదికళై విట్టు అశుద్ధమ్ శెయ్‌కిఱోమ్. పూమియిన్ పుత్తిరఙ్గళాన నామ్ ఒరువర్ క్కొరువర్ ద్వేషిప్పతన్ మూలముమ్, దూషిప్పదన్ మూలముమ్ ముక్కారణఙ్గళాలుమ్ ముడివిల్లా త్తున్బఙ్గళ్ శెయ్‌దవన్‌మూలముమ్ నమ్ తాయాకిఱ పూమియై త్తున్బుఱుత్తుకిఱోమ్. పొఱుమైయాకిఱ పాలై నమక్కు ఊట్టిన తాయిన్ వళియిల్ నామ్ నడక్కవేణ్డామో! పొఱైయిన్ మక్కళ్ కుఱైకూఱలామో? పొఱుమైయిల్ మిక్కవళాకైయాలుమ్, పూమియిల్ పిఱన్దు, వళర్న్ద నమక్కు ఇహపరపురుషార్‌త్తఙ్గళై అడైయచ్చెయ్‌బవళ్ ఇవళే యాకైయాలుమ్ ముదలిల్ "హ్రీ" ఎన్ఱు పూమిదేవి శొల్లప్పట్టాళ్. దేశభక్తి యెన్బదు తాయిడమ్ అన్బే. ఆనాల్ అన్ద మాతవియో మాదవనుడైయవళ్. అవళిడమ్ భక్తియెన్ఱు పెయర్ పూణ్డు అవనియాళ్‌నాదనిన్ ఆజ్ఞైకళై మీఱుకిఱార్‌కళ్ శిలర్. పూమిదేవి అవర్‌కళై ప్పొఱుక్కామల్ పారమాకవే కరుదువాళ్. పురుషోత్తమనిడ మిరున్దు పూమియై ప్పిరిప్పవర్‌కళ్ తకప్పనై విట్టు త్తాయై ప్పిరిప్పవర్‌కళాక క్కరుదప్పడువార్‌కళ్. పిరాట్టియై భగవానై విట్టు ప్పిరిత్త రావణన్ తలైయఱుప్పుణ్డాన్. పిరిక్కప్పార్‌త్త శూర్‌ప్పణకై మూక్కఱుప్పుణ్డాళ్"-ఎన్ఱు నమ్ ఆశారియర్‌కళ్ అరుళిచ్చెయ్‌దిరుప్పతు ఇఙ్గు అనుసన్ధిక్కత్తక్కదు."** (భూదేవి విషయమున మనము చేయు అపచారములకు ఒక లెక్కలేదు. ఆమె మనకు చేయు మంచికి అవధి లేదు. మనము నిలచియుండుటకు సహాయపడుచున్నది. మనము నడచునపుడును, పరుండియున్నపుడును ఎల్లప్పుడు మనలను మోయుచున్నది. ప్రాణములతోనుండుటకు అవసరమైన వానిని అనుగ్రహించి, కాపాడుచున్నది. మనము దానికి బదులుగా ఏమి చేయుచున్నాము? అమెను తవ్వుచున్నాము. నిశితములగు ఆయుధములతో గుచ్చి, గీఱి, చీల్చుచున్నాము. మలజలాదులను విడచి మలినపఱచుచున్నాము. భూదేవి పుత్రులమగు మనము ఒకరినొకరు ద్వేషించుటద్వారా దూషించుటద్వారా, త్రికరణములతో అంతులేని బాధలను పెట్టుటద్వారా మన తల్లియగు భూమిని బాధించుచున్నాము. క్షమ అనెడి క్షీరమును మనకు త్రాగించిన తల్లి దారిలో మనముకూడ నడువవలెనుకదా! క్షమాపుత్రులమగు మనము కొఱతను కల్గియుండవచ్చునా? క్షమాగుణములో అధికురాలు అగుటచేతను, భూమిలో పుట్టి పెరిగిన మనకు ఇహపరపురుషార్థములను అనుగ్రహించునది ఈమెయే అగుటచేతను వేదపురుషుడును మొట్టమొదట **"హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ"** అనుచు భూదేవిని కీర్తించెను. దేశభక్తి అనునది మాతృభక్తికి మాఱురూపమే. కాని, ఆ మాధవి మాధవుని పత్ని. ఆమెపట్ల భక్తిని కల్గియున్నను, ఆ అవనీనాథుని ఆజ్ఞను కొందఱు మీఱుదురు. అట్టివారిని భూదేవి క్షమింపకుండ, వారిని తనకు బరువుగానే తలచుచున్నది. పురుషోత్తమునినుండి భూమిని వేఱుచేయువారు తండ్రినుండి తల్లిని వేరుచేయువారుగనే దూషింపబడుదురు. "సీతాదేవిని శ్రీరామునినుండి విశ్లేషింపజేసిన రావణుడు శిరచ్ఛేదమును శిక్షగా పొందెను. వేఱుచేయవలెనని ప్రయత్నించిన శూర్పణఖ ముక్కు చెవులు ఖండింపబడినవి" – అని మన పూర్వాచార్యులు అనుగ్రహించుట ఇచట అనుసంధేయము) అనియును గల పెద్దల సూక్తులిచట అనుసంధేయములు. ఇక, భూసూక్తములోని విశేషార్థములను సంగ్రహముగా అనుసంధించెదము.

**(1)** **భూమి ర్భూమ్నా ద్యౌ ర్వరిణాంతరిక్షం మహిత్వా ।**
**ఉపస్థే తే దేవ్యదితేగ్ని మన్నాద మన్నాద్యాయాదధే ॥**

దేవి=భూదేవీ!, భూమ్నా= విస్తృతిచే, భూమిః= భూమిగను, వరిణా= ఔన్నత్యముచే, ద్యౌః= దేవలోకముగను, మహిమ్నా= మహిమచే, అంతరిక్షం =అంతరిక్షలోకముగను నీవు అగుచున్నావు, అదితే =పూర్ణురాలా!, తే =నీకు, ఉపస్థే =సమీపములో, అన్నాదం= పరమాత్మను అనుభవింపదగిన, అగ్నిం= జీవాత్మను, అన్నాద్యా =పరమాత్మను అనుభవించుటకొఱకు, ఆదధే =సమర్పించుచున్నాను.

భూదేవియొక్క వైలక్షణ్యములను పురస్కరించుకొని, ఆత్మవస్తువును ఆమె సన్నిధిలో వేదపురుషుడు సమర్పించుచున్నాడు. **(భూమిర్భూమ్నా)** – విస్తృతితో, క్షమ మొదలగు గుణములతో గొప్పదియైయుండుటచే, **"భూమి"** అని చెప్పబడునది ఈమె. విస్తీర్ణమును కల్గినదియై, మనము చూచు భూమిని శరీరముగా కల్గినది–అని భావము. ఈ భూమిమాత్రమేనా ఈమెకు శరీరము? అనినచో,
**(ద్యౌర్వరిణా)** – ఔన్నత్యగుణముతో దేవలోకముగనుండునది కూడ. ఉన్నతమగు దేవలోకము సైతము ఈమె శరీరమే అని భావము.

**"ఆయిరక్కణ్ వానవర్‌కోన్**
**పొన్నకరమ్ పూక్కమరర్ పోత్తిశెయ్య పొఙ్గొళిశేర్**
**కొన్నవిలుమ్ కోళరిమాత్తాన్ శుమన్దకోలమ్ శేర్**
**మన్నియ శిఙ్గాశనత్తిన్‌మేల్ వాణెడుఙ్కణ్**
**కన్నియరాలిట్ట కవరిప్పొది యవిళ్న్దు ఆ**
**ఙ్గిన్నిళమ్ పూన్దెన్ఱలియఙ్గ మరుఙ్గిరున్ద**
**మిన్ననైయ నుణ్‌మరుఙ్గుల్ మెల్లియలార్ వెణ్‌ముఱువల్**
**మున్నమ్ ముకిళ్‌త్త ముకిళ్‌నిలావన్దరుమ్బ**
**అన్నవర్‌తమ్ మానోక్క ముణ్డాఙ్కణిమలర్‌శేర్**
**పొన్నియల్ కఱ్పకత్తిన్ కాడుడుత్త మాడెల్లామ్**

మన్నియ మన్దారమ్ పూత్త మదుత్తివలై
ఇన్నిశై వణ్డమరుమ్ శోలైవాయ్ మాలైశేర్
మన్నియ మామయిల్‌పోల్ కూన్దల్ మళైత్తడజ్గణ్
మిన్నిడైయారోడుమ్ విళైయాడి వేణ్డిడత్తు
మన్ను మణిత్తలత్తు మాణిక్కమఞ్జరియిన్
మిన్నినొళిశేర్ పళిఙ్గు విళిమ్బుదుత్త
మన్నుమ్ పవళక్కాల్ శెమ్బున్‌శెయ్ మణ్డపత్తుళ్
అన్ననడైయ వరమ్బైయర్‌తమ్ కైవళర్‌త్త
ఇన్నిశైయాళ్ పాడల్‌కోట్టిన్బుత్తు ఇరువిశుమ్బిల్
మన్నుమళై త్తవళుమ్ వాణిలా నీణ్‌మదితోయ్
మిన్నినొళిశేర్ విశుమ్బూరు మ్మాళికైమేల్
మన్ను మణివిళక్కై మాట్టి మళైక్కణ్ణార్
పన్ను విశిత్తిరమాప్పాప్పుదుత్త పళ్ళిమేల్
తున్నియ శాలోకమ్‌శూళ్ కతవమత్తాళ్ తిఱప్ప
అన్న ముళక్క నెఱిన్దుక్క వాణీల
చ్చిన్ననఱున్దాదు శూడి ఓర్‌మన్దారమ్
తున్ను నఱుమలరాల్ తోళ్‌కొట్టి క్కఱ్పకత్తిన్
మన్నుమలర్‌వాయ్ మణివణ్డు పిన్ తొడర
ఇన్నిళమ్బూన్తెన్ఱల్ పుకున్దు ఈఙ్గిళములైమేల్
నన్నఱుమ్ శన్దనచ్చేఱుళ్ పులర్‌త్తత్తాజ్గరుమ్ శీర్
మిన్నిడైమేల్ కై వైత్తిరున్దేన్దిళములైమేల్
పొన్నరుమ్ పారమ్ పులమ్బ అకకులైన్దా
జ్గిన్నవురువినిమైయా త్తడజ్గణ్ణార్
అన్నవర్ తమ్మానోక్క ముణ్డాజ్గణిముఱువల్
ఇన్నముదమ్ మాన్దియిరుప్పర్"

(వేయికన్నులను కలవాడగు ఇంద్రుని అందమైన లోకమును చేరి, దేవతల ఉజ్జీవనమును పొంది, నిత్యము మరింతగా వృద్ధి చెందునట్టి కాంతిని కల్గినది, చంపునట్టి స్వభావమును కల బలమైన సింహముచే మోయబడినది, అందమైనది, పొందికను కల్గినదియు అగు సింహాసనముపైనుండి, వేలాయుధమువంటి, నిశితములైన, దీర్ఘములైన కన్నులనుకల కన్యలచే వీచబడిన చామరముల సమూహముల తమపై విస్తరింపగా, మధురమైన, మందమైన, పరిమళమును కల్గినదగు మలయమారుతము వీచగా, సమీపముననున్న మెఱపువంటి సూక్ష్మమైన నడుమునుకల స్త్రీలు (తమ) తెల్లని దంతములతో అభిప్రాయము సూచించునట్టి లేతవెన్నెల వంటి చిఱునవ్వు పైన ప్రసరింపగా, అట్టి స్త్రీలయొక్క లేడిచూపులను అనుభవించి, అపుడు అందమైన పూలతో నిండియున్న బంగారు కల్పకవనములతో నిండియున్న ప్రదేశములన్నిటియందు స్థిరముగా నిలచియున్న పారిజాతవృక్షముల పూవులలోని మకరందబిందువులలో తీయనిరాగములను పాడుచున్న తుమ్మెదలు పొందికగానున్న కేశములను కల్గినవారు, చల్లని, విశాలములైన నేత్రములను కలవారును, మెఱపువంటి, సన్నని నడుమును కలవారును అగు అప్సరసస్త్రీలతో యథేష్టముగ ఆయా ప్రదేశములలో ఆనందించి, గొప్పరత్నములు పొదిగిన స్థలములలో నిర్మింపబడి, మాణిక్యమయములగు పూలగుత్తులను కల్గినది, మెఱపువలె తళతళమని ప్రకాశించుచున్న స్ఫటికమణులచే కరుడుకట్టిన గొప్ప పగడస్తంభములను కల్గినది, ఎఱ్ఱని బంగారముతో చేయబడినది అగు మండపములో హంసల నడకలవంటి నడకలను కల అప్సరసల చేతులద్వారా వాయింపబడిన మధురములగు రాగములనుకల వీణాగానమును విని ఆనందించియు, విస్తరించిన ఆకాశములో పొందికగానున్న మేఘమండలములు వచ్చి నిలచియున్నది, అందమైన వెన్నెలనుకల గొప్ప చంద్రుడు వచ్చి, చేరియున్నది, మెఱపుతీగ కాంతివంటి కాంతిని కల్గినది, ఆకాశములో సంచరించునదియును అగు విమానములో చల్లని కన్నులను కలవారగు వనితలు ఎన్నడును ఆరిపోని దీపములను వేలాడదీసి, ఆశ్చర్యకరముగా విస్తారముగా పఱచిన, పొగడతగిన శయనమునందు నిబిడముగా నున్న, గవాక్షములను చుట్టియున్న తలుపులు తెఱచుకొనగా పరమభోగ్యమైనది మందమారుతము హంసలు సమ్మర్దము నలిగి, చిన్న చిన్న కణములుగానైన పుష్పములచే బాహువులను అలంకరించుకొని, కల్పవృక్షములో పొందికగానున్న పూవులలో నిలచియున్న అందమైన తుమ్మెదలచే వెంబడింపబడినదియై, వీరు రమించుచోట్లకు వచ్చి చేరగా, లేలేతస్తనములపై పూయబడిన మంచి సుగంధమునుకల చందనపంకమును చక్కగా అలదిన, ధరింపవీలుకాని, సూక్ష్మమైన, మెఱపుతీగవంటి నడుముపై చేతిని పెట్టుకొని, ఉన్నతములగు ఎత్తైన స్తనములపై కాసులమాలలు ప్రకాశించుచుండగా, ఆ సన్నివేశమును చూచి, ఇట్టి విలక్షణమైన రూపమును కల దేవకన్యల లేడిచూపులవంటి చూపులను అనుభవించి, దానితోకూడ వారి అందమైన చిఱునవ్వు అనెడి మధురామృతమును గోలుదురు) – అనుచు తిరుమజ్గైయాళ్వార్లు పెరియ తిరుమడల్ ప్రబంధములో అనుగ్రహించిన గొప్పతనమును కల దేవలోకమునకును అభిమాని దేవతయై యుండునది ఈమెయే అని భావము. **(అంతరిక్షం మహిత్వా)** సూర్యచంద్రాదులు సంచరించుటకు తగిన అవకాశమును కల్గియుండుట అనెడి మహిమనుకల అంతరిక్షలోకమునై యున్నావు–అని భావము. **"భూమి"** అనునది క్రిందగల లోకములకును, **"ద్యౌః"** అనునది పైనగల లోకములకును ఉపలక్షణము. క్రింద,పైన, నడుమనగల ముల్లోకములును నీవే అయి ఉన్నావు. వానిని శరీరముగా కల్గినదానవు నీవే అని సారము.

ఇట్లు లోకములను అన్నిటిని శరీరముగా కల్గినది అయినచో, ఈదేవియొక్క

స్వరూపము సర్వేశ్వరుని స్వరూపమువలె విభువైయుండవలెనుకదా! అనినచో, అట్లు కాదు. ఈమె జీవకోటికి చెందినదియే అనునది సర్వసమ్మతమగుటచే మిగిలిన జీవులవలె ఈ పిరాట్టియు అణువే. అయినను, అన్నిలోకములను తన జ్ఞానబలములతో వ్యాపించి, ధరించియుండును, కావున వానిని శరీరముగా కల్గినది అనుటలో దోషములేదు. **"తథా భూమి శ్చ నీళా చ శేషభూతే మతే మమ, స్వరూపత స్తు న తయో ర్గుణతో వ్యాప్తి రిష్యతే"** (అట్లే భూనీళాదేవులును భగవానునకు శేషభూతలు అనునది నా మతము. అయినచో, వారికి స్వరూపవ్యాప్తి లేదు. గుణతో వ్యాప్తియే యున్నది) ఇత్యాది ప్రమాణవచనము లిచట స్మరణీయములు.

**(తే ఉపస్థే)** – నీ సమీపమున–అని అర్థము. తల్లి అగు నీ సమీపములో, మలమూత్రాదులను విడచుట, తవ్వుట, గుచ్చుట–మొదలగు దోషములను ఎన్నిటిని చేసినను, వానిని సహించి, మాకు పాలను, పెరుగును, నేతిని, అన్నమును అనుగ్రహించి, ప్రాణములను నిలుపుచున్న ఉత్తమ జనని అగు నీ సమీపమున అని **"తే"** అను సర్వనామశబ్దముచే ధ్వనించును. దోషములను చూచి, కోపించు భగవానునితో "దోషమనునది లేనే లేదు" అని వాదులాడి, అతనిని జయించిన నీ సమీపము–అనియు అర్థము.

**(దేవి)** – దేవుడగు సర్వేశ్వరుని పత్నియైనదానా! పురుషకారమును చేయదగిన సంబంధమును కల్గినదానా! మాతో, స్వామితో నీవు సంబంధమును కల్గినదానివి అగుటచే నీవే. పురుషకారమును చేయదగినదానవు–అని భావము.

**(అదితే) – ''దో–అవఖండనే''** అను ధాతువునుండి పుట్టిన ఈ పదము "అఖండమైయున్నదానా!" అను అర్థమిచ్చును. ఇట్లు లోకములను అన్నిటిని శరీరముగా కల్గియుండుటచే పూర్ణమైయున్నదానా! అని అర్థము. లేక, "క్షమ మొదలగు గుణములతో పూర్ణమైయున్నదానా!" అనియును అర్థము. **(అన్నాదమ్ అగ్నిమ్) "అహ మన్నాదః"** (తై.భృగు–10–5) (నేను పరమాత్మయొక్క ప్రీతి అనెడి అన్నమును అనుభవించువాడను) అనుచు ముక్తుని సామగానములో చెప్పబడుటచే ఇచట **''అన్న''** మనునది భగవదనుభవమునకు పేరు. ఆనందమును అనుభవించుటకు తగిన యోగ్యతను కలవాడగుటచే బద్ధజీవుడును **"అన్నాదః"** అనబడదగినవాడు అగుచున్నాడు. **"అగ్రం నీయత ఇత్యగ్నిః"** (పైకి కొనిపోబడుచున్నాడు) అను వ్యుత్పత్తిద్వారా జీవుడు అగ్నిశబ్దవాచ్యుడు. భగవదనుభవమనెడి అన్నమును అనుభవింపదగినది, పరమపురుషునిచే పైకి కొనిపోబడతగినదియును అగు ఈ ఆత్మవస్తువును–అని భావము.

**(అన్నాద్యాయ)** భగవదనుభవమనెడి అన్నమును అనుభవింపజేయుట కొఱకు–అని అర్థము. ఈనాటివరకు ప్రాకృతమగు అన్నమును (అనుభవమును) అనుభవింపజేసి పెంచిన తల్లివి అగు నీవే, ఇక అప్రాకృతమైన అన్నమునుకూడ నీ బిడ్డకు పెట్టవలెను సుమా! –అని భావము.

**(అన్నాద్యాయ తే ఉపస్థే ఆదధే)** అన్నమును తినిపించుటకై ఉత్తమమాతవు అగు నీ సన్నిధిలో ఈ ఆత్మవస్తువును సమర్పించుచున్నాను. **"ఉపస్థమ్"** అనునది ఒడికి ఉపలక్షణము. తన ఒడిలో నుంచుకొని తల్లి బిడ్డకు అన్నమును పెట్టుట అలవాటుకదా! **"అహ మద్యైవ మయా సమర్పితః"** (స్తోత్ర) (నా ఆత్మవస్తువు ఇపుడే నాచే సమర్పింపబడినది) అని, **"ఎనదావి తన్దొళిన్దేన్"** (నా ఆత్మను సమర్పించితిని – తిరువాయ్‌మొళి) ఇత్యాది సూక్తుల అర్థమిచట స్మరణీయము.

**(2)** **ఆయఙ్గౌః ప్రశ్ని రక్రమీ దసనన్మాతరం పునః ।**
**పితరం చ ప్రయన్ సువః ॥**

గౌః= భూదేవీ!, అయమ్ =ఈ, ప్రశ్నిః = తెల్లని వర్ణమునుకల సూర్యుడు, ప్రయన్ = వేగముగా వెడలుచు, మాతరం= తల్లివి అగు నిన్ను, అక్రమీత్= ప్రదక్షిణము చేసెను, పునః చ= మఱియు, సువః= అందమైన గమనమును కల్గినవాడై, పితరం= తండ్రియగు పరమపురుషుని, అసనత్ =తనకు అంతర్యామిగా పొందెను.

మొదటిమంత్రములో పరమపురుషుని ఆశ్రయించుటకొఱకు భూదేవిని సూర్యుడు శరణు పొందెను అని, ఈ రెండవ మంత్రములో నిన్ను ప్రతిదినము ప్రదక్షిణమును చేయుటద్వారా సూర్యుడు నారాయణుని నివాసముగా ఉండు చోటుగానున్నట్టి గొప్పతనమును పొందెను–అని తెలుపబడుచున్నది. **(గౌః భూదేవీ! (సువః ప్రయన్ అయం ప్రశ్నిః)** – ఆకాశములో వేగముగా సంచరించు ఈ సూర్యుడు అని అర్థము. **"సువః"** అనునది ఆకాశమునకు ఉపలక్షణము. లేక, ప్రతిపదార్థములో చూపిన రీతిలో, అనంతరవాక్యముతో అన్వయించియు, అర్థమును చెప్పవచ్చును. **(మాతరమ్ అక్రమీత్)** తల్లివి అగు నిన్ను పరిక్రమించెను. అనగా ప్రతిదినము ప్రదక్షిణమును చేసెను. దీనివలన పొందబడిన ఫలము ఇకపై తెలుపబడుచున్నది. **(పునః పితరం చ అసనత్)** నీతోనే కాకుండ, నీ నాథుడు, మాకు అందఱికిని తండ్రి అగు శ్రీమన్నారాయణునికూడ తనకు అంతర్యామిగా పొందెను.

**ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ**
**నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః ।**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః ॥**

(సూర్యమండలము నడుమన నున్నవాడును, కమలాసనములో వేంచేసియుండువాడును, కేయూరములను, మకరకుండలములను, కిరీటమును, హారమును కల్గినవాడును, బంగారు శరీరమును కలవాడును, శంఖచక్రములను దాల్చినవాడును అగు నారాయణుడు ఎల్లప్పుడు

ధ్యానింపతగినవాడు) అని ఉపాసకులకు ధ్యానవిషయమైన, భగవానునకు స్థానమయ్యెను.

**(3) త్రిగ్ంశద్ధామ విరాజతి వాక్పతంగాయ శిశ్రియే ।**
**ప్రత్యస్యవహ ద్యుభిః ॥**

త్రిశంత్ ధామ =ముప్పదిస్థానములలో (ముప్పది ముహూర్తములలో) విరాజతి =మిక్కిలి వెలుగుచున్నాడు (సూర్యుడు), వాక్ =వేదవాక్కు, పతంగాయ శిశ్రియే= సూర్యుని ఆక్రమించు చున్నది, ద్యుభిః= (నీ) తేజస్సులతో, అస్య= ఈ (నా) యొక్క, ప్రతి= ప్రతికూలవర్తనమును, వహ =పోగొట్టుము.

భూదేవికి ప్రదక్షిణమును చేయుటద్వారా సూర్యుడు పొందిన సత్ఫలములనుగూర్చి అనంతరము పలుకుచు, తన ప్రాతికూల్యమును పోగొట్టవలయునని ఈ మంత్రములో వేదపురుషుడు ప్రార్థించుచున్నాడు.

**(త్రింశద్ధామ విరాజతి)** సూర్యుడు ప్రతిదినము ముప్పది ముహూర్తముల కాలము ప్రకాశించును. సర్వాధారమగు కాలమును తెలుపు **"ధామ"** శబ్దము ఇచట కాలమునకు అవయవమగు ముహూర్తమును తెలుపుచున్నది. **"ప్రశ్నిః"** అను సూర్యవాచకశబ్దమును పూర్వమంత్రమునుండి అనువృత్తి చేసికొననగును. ఇతడు గొప్పకాంతితో ప్రతిదినము ప్రకాశించుట నీ కృపవలననే–అని భావము.

**(వాక్ పతంగాయ శిశ్రియే)** వేదవాక్కు సూర్యుని ఆశ్రయించినది. ఉదయమున ఋగ్వేదముతో, మధ్యాహ్నమున యజుర్వేదముతో, సాయంకాలమున సామవేదముతో స్తుతింపబడుచున్నాడు అని వేదములో వేఱొకచోటకూడ చెప్పబడినది. ఆకాశములో పక్షివలె సంచరించువాడు. కావున సూర్యుడు **"పతంగ"** శబ్దవాచ్యుడు.

**(ప్రత్యస్యవహ ద్యుభిః) – "గౌః"** అను పదమును ముందు మంత్రమునుండి అధ్యాహరించుకొనదగును. భూదేవీ! నీ సౌశీల్యవాత్సల్యాది గుణములను గొని, మిక్కిలి తక్కువ స్థితిలోనుండు నా ప్రాతికూల్యమును పోగొట్టుము. ఇచట కల్యాణగుణములు తేజస్సులుగా, లేక, కిరణములుగా చెప్పబడుచున్నవి. **"అస్య"** అనుచు మిక్కిలి తక్కువదశలో నున్నట్లుగా తనను వేదపురుషుడు నిర్దేశించుకొనుచున్నాడు లేక, **"పితరమ్"** అని పూర్వశ్లోకములో ప్రస్తుతమగు సర్వేశ్వరుని **"అస్య"** అను పదముతో ప్రస్తావించుచున్నట్లు భావించి, అతనికి నా విషయముగానున్న ప్రాతికూల్యమును నీ కాంతిసౌందర్యసౌకుమార్యాది గుణములతో పోగొట్టుము–అను అర్థమునుకూడ చెప్పవచ్చును. **"శృణాతి నిఖిలాన్ దోషాన్"** (చేతనులపట్లగల దోషములను, ఈశ్వరుని పట్లగల నిరంకుశస్వాతంత్ర్యాదిదోషములను పోగొట్టుచున్నది) అనునదికదా భూదేవి స్వభావము.

ఇట్లు కాకుండ, ఈ మంత్రమునంతటిని భగవత్పరముగా అన్వయించి, కొందఱు అర్థమును చెప్పిరి. **(తింశద్ధామ విరాజతి)** సర్వేశ్వరుడు ప్రతిదినము ముప్పది ముహూర్తముల కాలము రక్షణలో నిలచియున్నవాడై ప్రకాశించును. **(వాక్ పతంగాయ శిశ్రియే)** వేదవాక్కు **"ద్వా సుపర్ణా"** అను మంత్రములో పక్షిగా నిరూపింపబడిన సర్వేశ్వరుని ఆశ్రయించియున్నది. లేక, వేదము హంసరూపియై ఆనాడు వేదములను అనుగ్రహించిన భగవానుని ఆశ్రయించినది –అని అర్థము. **(ద్యుభిః అస్య ప్రతివహ)** సర్వలోకపితా! నీ తేజస్సుతో, గుణములతో నా ప్రాతికూల్యమును పోగొట్టుము.

**(4) అస్య ప్రాణా దపానత్యంత శ్చరతి రోచనా**
**వ్యఖ్యన్మహిషః సువః**

అస్య= ఈ పరమపురుషునియొక్క, రోచనా= తేజస్సు, ప్రాణాత్ =ప్రాణనమనెడి పనిని చేసిన పిమ్మట, అపానతీ =అపానము అను పనిని చేయునదియై, అంతః చరతి= లోపల సంచరించుచున్నది. **మహిషః**= పెద్ద శరీరములోనున్నదియై, **సువః** =అందమైనదియై, వ్యఖ్యత్ =ప్రకాశించుచున్నది.

ఈమంత్రములో వేదపురుషుడు పరమపురుషుని స్తుతించుచున్నాడు. **(అస్య రోచనా అంతశ్చరతి)** ఈ పరమపురుషుని తేజస్సే ప్రాణులయందును సంచరించుచున్నది. ఎందులకు సంచరించుచున్నది? అనినచో, **(ప్రాణాత్ అపానత్) "ప్రాణనమ్"** (నరములద్వారా వాయువును ఊర్ధ్వముఖముగా వచ్చునట్లు చేయుట), **"అపానమ్"** (నరములద్వారా వాయువును అధోముఖముగా వచ్చునట్లు చేయుట) అను పనులకును చేయుటకొఱకు దేహములో భగవానుని తేజస్సు సంచరించును. లేక, మోక్షపర్యంతమగు, ఉన్నతమగు ఆనందమును, తక్కువది అగు ఇహలోకసుఖములను పొందించుటకు సంచరించుచున్నది అనియును చెప్పవచ్చును. **"కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ య దేష ఆకాశ ఆనందో న స్యాత్"** (ఆనందస్వరూపియగు ఈ పరమాత్మలేనిచో ఎవడు ఈ ఇహలోకసుఖములను, పరలోకసుఖములను పొందగలడు)? అనెడి ఉపనిషద్వాక్యమును ఇచట స్మరింపనగును. ఆ తేజస్సు ఎట్లు ప్రకాశించుచున్నది? అనినచో, **(వ్యఖ్య న్మహిష స్సువః)** – గొప్పది అగు శరీరములో నున్నదియై, అందమైనదియై ప్రకాశించుచున్నది. **"మామేని మాయవన్"** అని కీర్తింపబడు గొప్ప శరీరమునుకల **"మాశూణా చ్చుదరుదమ్ము"** (దోషరహితమైన జ్యోతి స్స్వరూపము) అని కీర్తింపబడు భగవానుని శరీరమును ఆశ్రయించుటచే విశేషముగా ప్రకాశించుచున్నది–అని అర్థము.

**(5) యత్త్వా క్రుద్ధః పరోవప మన్యునా యదవర్త్యా**
**సుకల్ప మగ్నే తత్తవ పునస్త్వోద్దీపయా మసి**

అగ్నే =పరమపురుషా, అవర్త్యా =శక్తిని లేకుండుటచే, క్రుద్ధః =కోపించిన నేను, మన్యునా=

కోపముతో, త్వా =నిన్ను, పరోవప యత్ =విడచితిని అనునది ఏది కలదో, తత్ =అది, తవ =నీయొక్క (అనుగ్రహముతో) పునః =తిరిగి, సుకల్పం =చక్కగా చేసినది అగుగాక, త్వా =నిన్ను, ఉద్దీపయామసి =జ్వలించునట్లు చేయుదుము.

తానుచేసిన అకృత్యమునకు పరమపురుషుని సన్నిధిలో క్షమను ప్రార్థించుట ఇందలి విషయము. **(యత్వా క్రుద్ధః పరోవపమన్యునా యదవర్త్యా)** పాపఫలమగు అనుభవములను అడ్డుకొనుటకు శక్తి లేకపోవుటచే, వానిని అనుగ్రహించు నీపై కోపమును పొంది నిన్ను నేను చేయివిడచితిని-అనునది ఏది కలదో?

**(అవర్త్యా క్రుద్ధః)** శక్తిలేకుండుట కోపమునకు కారణమగుననుట లోకప్రసిద్ధము కదా! **"అశక్తా స్తత్పదం గంతుమ్ తతో నిందాం ప్రకుర్వతే"** (ఋజువగు రీతిలో ప్రవర్తించుటకు శక్తి లేనివారు నిందావాక్యములను పల్కుదురు) అని చెప్పబడుచున్నదికదా! **(సుకల్పం తత్తవపునః )** - దుష్కృత్యము నీ అనుగ్రహముతో తిరిగి మంచిపరిణామమును కల్గినది అగునుగాక! (పునః) మఱల. ఇదివరకే ఇతడు భగవద్ధ్యానమును చేయువాడైయుండియు, పాపఫలానుభవముతో స్వామిపట్ల కోపమును పొంది, భగవానుని విడచిపెట్టినవాడుకదా! అందుచే మరల "నన్ను నీ భక్తునిగా చేయవలెను" -అని ప్రార్థించుచున్నాడు. **(అగ్నే)** అగ్రనయనమునే. (ఊర్ధ్వదిశగా జీవుని కొనిపోవుటయే) స్వభావముగా కలవాడా! ఇట్టి నీవు నా చేయి విడువరాదు-అని భావము. నేను నిన్ను విడచినను, నీవు నా చేతిని విడువరాదు సుమా! అని ఇచటి హృదయము. **(అగ్నే పున స్త్వయా ఉద్దీపయా మసి)** అగ్నీ! మఱల నిన్ను జ్వలింపజేయుదును. నిన్ను ధ్యానించుటద్వారా నిన్ను తిరిగి కాంతిని పొందినవానినిగా చేయుదును. చేతనుడు అతనిని చేయి విడచిన పిదప భగవానుడు కాంతి తరిగినవాడైకదా! ఉండును కదా. తిరిగి ఇతనిని (జీవుని) పొందిన పిమ్మట కాంతిని అధికముగా పొందును -అని భావము. **"పరంజ్యోతి రుపసంపద్య"**-అని సంస్కృతవేదము, **"ఎన్ కణ్పాశమ్ వైత్త పరఞ్జుదర్శోది"** (నా విషయమున వాచ్యల్యమును గల పరంజ్యోతి స్వరూపుడు) అని ద్రావిడవేదమును చేతనుని పొందిన పిమ్మట భగవానుడు కాంతిని అధికముగా పొందినవాడగును అని ఉత్ప్రేక్షించినవికదా!

**(6) యత్తే మన్యుపరోప్తస్య పృథివీ మను దధ్వసే ।**
**ఆదిత్యా విశ్వే తద్దేవా వసవ శ్చ సమాభరన్ ॥**

మన్యుపరోప్తస్య=కోపముతో విడువబడిన, తే=నీ యొక్క, యత్ = ఏ తేజస్సు, పృథివీమను =భూమిని అనుసరించి, దధ్వసే =లయమును పొందినదో, తత్ =ఆ తేజస్సును, ఆదిత్యాః =ఆదిత్యులును, విశ్వేదేవాః =విశ్వేదేవులును, వసవః చ=వసువులును, సమాభరన్ =ధరించిరి.

భూదేవి చేయు పురుషకారమువలన పరమపురుషుడు తనయందు ఆరోపించుకొనిన కోపము తీరినవాడగుటను వేదపురుషుడు ఈ మంత్రములో తెలుపుచున్నాడు. **(యత్తే మన్యుపరోప్తస్య)** కోపముతో నాచే చేయివిడువబడిన నీయొక్క తేజస్సు ఏది కలదో-అని భావము. నేను విడచుటచే నీకు ఏర్పడిన కోపమనెడి తేజస్సు. **(పృథివీ మనుదధ్వసే)** - ఏతేజస్సు భూమిని అనుసరించి, లయమును పొందినదో, -అని అర్థము. భూదేవి పురుషకారకృత్యమును చేయుటచే, ఆమె అభిప్రాయమును అనుసరించి, లయమును పొందినదో - అని భావము. భూదేవిచే ఉపశమింపజేయబడిన ఆ తేజస్సుయొక్క తీవ్రత పిమ్మట ప్రస్తావింపబడుచున్నది.

**(తత్ ఆదిత్యా విశ్వే దేవా వసవ శ్చ సమాభరన్)** ఆ తేజస్సును పండ్రెండుమంది ఆదిత్యులు, విశ్వేదేవులు, అష్టవసువులును ధరించిరి. వీరియందు కన్పించు తీవ్రమైన తేజస్సు పరమపురుషునకు చెందినదియే-అని భావము, **"తస్య భాసా సర్వ మిదం విభాతి"** (ఆ పరమపురుషుని కాంతిచే సూర్యుడు మొదలగు అందఱును ప్రకాశింతురు) అనెడి వేదవాక్యము ఇచట స్మరణీయము. ఆదిత్యులు మొదలగువారివద్ద కనుపించు తీవ్రమైన తేజస్సు ఈ పరమపురుషునకు చెందినదియే. అట్టి తేజస్సునకు లక్ష్యము కాకుండ నన్ను భూదేవి కాపాడినది అని ఆమె యొక్క గొప్ప ఉపకారమునుగూర్చి వేదపురుషుడు పల్కుచున్నాడు. లేక, నీవు కోపించిన కాలములో నీకు తగిన సమాధానములను పల్కి, ఆ కోపమును భూదేవి తీర్చినది. అట్టి నీ స్వరూపమును ఆదిత్యాది మహానుభావులు ధ్యానమును చేయుచున్నారు. వారితో నేను కూడ ధ్యానము చేయుదును-అనుచు అర్థమును చెప్పువారును కలరు.

**(7) మేదినీ దేవీ వసుంధరా స్యా ద్వసుధా దేవీ వాసవీ ।**
**బ్రహ్మవర్చసః పితృాణాం శ్రోత్రం చక్షు ర్మనః ॥**

వసుంధరా= రత్నములు మొదలగు ధనములను ధరించునదియై, వసుధా =ఆ ధనములను పోషించునదియై, వాసవీ =ధాన్యరూపమైన ధనమును కల్గినదియై, దేవీ =ప్రకాశించునదియైన, మేదినీ దేవీ =భూదేవి, స్యాత్ =(నా పట్ల అనుగ్రహమును కల్గినదిగా) అగునుగాక!, పితృాణాం =నన్ను రక్షించినవారికిని, (నాకును), శ్రోత్రం చక్షుః మనః =కన్ను, చెవి, మనస్సు మొదలైనవి అగు ఇంద్రియములను, బ్రహ్మవర్చసః =బ్రహ్మతేజస్సును (అనుగ్రహించుగాక!)

ఈ మంత్రమునుండి పదమూడవమంత్రమువరకుగల ఏడుమంత్రములు అథర్వణ వేదమునకు చెందినవి అని అందురు. కాని, ఇపుడు లభించు అథర్వణవేదములో కానవచ్చుట లేదు. అయినను, భూసూక్తములో ఈ మంత్రములు అన్ని ప్రాంతములలో అందఱిచే అనుసంధింపబడుచున్నది. ఈ మంత్రములలో చాలావరకు భూదేవియొక్క నామములే పఠింపబడుచున్నవి. **(మేదినీ దేవీ)** **"మధుకైటభదానవేంద్రమేదఃప్లవవిస్రా విషమైవ మేదినీయమ్"** (అనర్ఘరాఘవమ్1-14) (మధుకైటభులను పేరుగల అసురశ్రేష్ఠుల మేదస్సు

అనెడి మాంససమూహముచే దుర్గంధభూయిష్ఠమై, గంధవిషయములో విషమమైయున్నది ఈ భూమి) అనెడి మురారికవి పల్కినరీతిలో, దుష్టులనుండి తన సంతానమును కాపాడుటకు గంధవతి యగు తన దేహమును దుర్గంధప్రచురమును గావించుకొనుటకుకూడ వెనుకాడనిది అనుచు ఈమె పుత్రవాత్సల్యమును ఈ నామము వెల్లడి చేయుచున్నది. **(మేదినీ దేవీ)** మాంసప్రవాహముచే పూయబడినపుడును తాను అప్రాకృత అగుటచే దానితో సంబంధము లేకుండ ప్రకాశించునది. **"దేవీ"** అనగా **"దివు-ద్యుతౌ"** అను ధాత్వర్థమునుబట్టి ప్రకాశించునది అని అర్థము. **(వసుంధరా)** - బంగారము, వెండి, వజ్రవైడూర్యములు, గోమేధికము, రత్నము, పుష్యరాగము ఇత్యాది సంపదలను ధరించునది. సంపదకు అధిదేవత శ్రీదేవి. ఆ సంపదకు అంకురించు భూమియే భూదేవి. **(వసుధా)** సంపదలకు అంకురించు భూమి అగుటయేకాక దానిని వృద్ధి చేయునది కూడ.

**(వాసవీ)** - ధనరూపమైన సంపదకు మాత్రమే కాక, వరి, ధాన్యము, గోధుమ మొదలగు పలు విధములగు ధాన్యరూపమైన సంపదకు ఈమె నెలవైయున్నది. **(దేవీ)** - **"దివు-క్రీడా"**-అను ధాతువునుండి పుట్టిన పదముగా దీనిని గ్రహించినచో, ఈ సంపదలను ఇతరులకు అనుగ్రహించి, వారు దానిని సంపాదించుటయందు, రక్షించుట యందును పడునట్టి కష్టములను చూచి, నవ్వి, క్రీడించునది. సర్వేశ్వరునకు చెందినది అగు తన విభూతిలోని ఒకమూలను పాలించు ప్రభువులు, తమను అండాధిపతిగా అభిమానించి, కొద్దిదినములు గడువగానే మట్టిలో కలసి, నశించి పోవుటను చూచి, నవ్వుచు క్రీడించును.

**(దేవీ)-"దివు-విజిగీషా"** అను ధాతువునుండి ఉత్పన్నమైన పదముగా గ్రహించినచో, భూమిని అంతటిని జయించినట్లు తమను అభిమానించు దురీశ్వరులను జయించి, వారిని ఆడించును. భూమిని అంతటిని జయించినట్లుకదా వారు తలతురు. వాస్తవమునకు రాజ్యాధికారకాంక్షకు వశులైనవారిని భూదేవి జయించి, ఆడించుచున్నది. **(దేవీ)-"దివు-ద్యుతి", "దివు-కాంతి"** అను ధాతువులనుండి పుట్టిన పదమని భావించినచో, కాంతితో, రూపసౌందర్యముతో అందఱిని మించియుండునది-అని అర్థము. **"వడివిణైయిల్లా మలర్మకళ్, మత్తనిలమకళ్"** (రూపసౌందర్యమున సాటి లేని లక్ష్మిదేవి, మరియు భూదేవి) అనుచు ఈ అర్థమును ఆళ్వార్లు, **"ఏవంభూతభూమి"** (శరీర సౌందర్యము మొదలగువానిలో లక్ష్మీదేవివలెనుండు భూదేవి) అని శరణాగతిగద్యలో భగవద్రామానుజులు కూడ అనుగ్రహించిరి. **"దివు"** అను ధాతువునకుగల మిగిలిన అర్థములు లక్ష్మీదేవి విషయములోవలె ఈ దేవేరికిని తగియుండుటను గమనింపనగును. **(దేవీ)** దేవుడగు పరమపురుషునకు పత్ని అను అర్థముకూడ తగినదియే. **(స్యాత్)** - ఇట్టి భూదేవి మాపట్ల అనుగ్రహమును కల్గినది అగుగాక! **(బ్రహ్మవర్చసః పిత్రూణాం శ్రోత్రం చక్షుః మనః స్యాత్)** నా తండ్రికిని, నాకును చెవి, కన్ను, మనస్సు మొదలగు ఇంద్రియములను, బ్రహ్మతేజస్సును భూదేవియొక్క అనుగ్రహమున కలుగుగాక! **(పిత్రూణాం) "జనితా చోపనేతా చ య శ్చ విద్యాం ప్రయచ్ఛతి, అన్నదాతా భయత్రాతా పంచైతే పితరఃస్మృతాః"** (జన్మ నిచ్చినవాడు, ఉపనయనమును చేసినవాడు, విద్యను ఇచ్చినవాడు, అన్నదాత భయమునుండి కాపాడినవాడు అను ఈ అయిదుగురు తండ్రులుగా చెప్పబడినారు) అని చెప్పబడిన అయిదుగురు తండ్రులకును, ఇది ఉపలక్షణము. మాకు చక్కని ఇంద్రియములను, బ్రహ్మతేజస్సును భూదేవి అనుగ్రహించుగాక! అని భావము. భూమాత అనుగ్రహించు అన్నము చేతనే ఇంద్రియములు పోషింపబడుటచే, తేజస్సు కల్గుటచే, ఆ తల్లి కృపచేతనే ఇవి సిద్ధించునుట శాస్త్రసిద్ధమగుటచే, వీనిని భూదేవివలన కలుగవలెనని వేదపురుషుడు ప్రార్థించుచున్నాడు.

### (8) దేవీ హిరణ్యగర్భిణీ దేవీ ప్రసూ వరీ
### నదనే సత్యాయనే సీద

సత్యాయనే =బ్రహ్మమునకు వాసస్థానమైయున్నదానా!, సదనే = (ప్రాణులన్నిటికిని) వాసస్థానమై యున్నదానా!, హిరణ్యగర్భిణీ =హిరణ్యమును నీ గర్భమున కల్గినదానివై, దేవీ= క్రీడించుదానివై, వరీ =**"వరమ్"** అను నిధిని కల్గినదానివై, దేవీ= దేవునకు పత్నివైయున్న నీవు, సీద =(నన్ను) అనుగ్రహింపుము.

నాపట్ల అనుగ్రహింపవలెననుచు వేదపురుషుడు భూదేవిని ప్రార్థించుచున్నాడు. **(దేవీ)** తన పుత్రులగు చేతనులను చూచి, క్రీడించునది. (లేక) పరమపదములో పరమపురుషునితో పాటు క్రీడించునది అనియును అర్థము. **(హిరణ్యగర్భిణీ)** - బంగారమును తన గర్భములో కల్గినది. ఇచటి **"హిరణ్య"** పదము శ్రేష్ఠములగు వస్తువులకు అన్నిటికిని ఉపలక్షణము. **(ప్రసూః)** ఉన్నతములగు వస్తువులను తన గర్భములో కల్గియుండునదియేగాక, గొప్ప వస్తువులను ప్రసవించునది. **(వరీ)** - **"వరమ్"** అనబడు నిధిని కల్గినది. (లేక) వరములను అనుగ్రహించునది అనియును అర్థము.

**(దేవీ)**-ఈ అతిశయములకు అన్నిటికిని మూలముగా దేవుడగు సర్వేశ్వరునకు పత్నియైయున్నది. లేక, పూర్వోక్తములగు అతిశయములచే ప్రకాశించునది అనియును అర్థము. **(సదనే)**- అందఱికిని నిలచు స్థానమైయున్నదానా! **(సత్యాయనే)** - **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అనబడు అనంతునకు నెలవుగను, అతనిని నెలవుగా కల్గినదిగను ఉన్నది. **"కిడన్దిరున్దు నిన్ఱళన్దు కేళలాయ్ క్కీళ్పుక్కు, ఇడన్దిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమిళుమ్, తడమ్బెరుమ్తోళార త్తళవుమ్ పారెన్నుమ్ మడన్దైయే మాల్శెయ్‌కిన్ఱమాలార్ కాణ్బారే"** అనునట్లు ఈ భూదేవి పరమపురుషునకు నివాసస్థానముగ, అతనిని తనకు నివాసస్థానముగనుండు స్థితులను నమ్మాళ్వార్లు వివరించిరి కదా! **(సీద)** ఇట్టి భూమాతా! నాకు అనుగ్రహింపుము.

**(9)** **సముద్రవతీ సావిత్రీ అనో దేవీ మహ్యాంగీ**
**మహీ ధరణీ మహో వ్యతిష్ఠాః**

**(10)** **శృంగే శృంగే యజ్ఞే యజ్ఞే విభీషణీ**
**ఇంద్రపత్నీ వ్యాపినీ సురసరి రిహ**

సముద్రవతీ =సముద్రమును (వసనముగా) కల్గిన దానివిగా, సావిత్రీ =సూర్యుని (తిలకముగా) కల్గినదానివిగా, అనః దేవీ= అకారవాచ్యుడగు పరమపురుషునకు దేవిగను, అంగీ =(**కారార్‌వరైక్కొఙ్జై, శెజ్గలులిప్పేరాత్తు, ప్పేరారమార్‌వు, పెరుమామళైక్కూన్దల్** మొదలగు) అందమైన అంగములను కల్గిన దానివిగా, మహీ =గొప్పతనమును కల్గినదానివిగా, మహః =కీర్తింపబడునదిగను, ధరణీ =అన్ని జీవరాసులను ధరించుచున్నదానివిగా, మహః =తేజోరూపిణివిగను, విభీషణీ =(అనాశ్రితులకు) భయమును కల్గించునదానివిగా, ఇంద్రపత్నీ =గొప్పసంపదనుకల సర్వేశ్వరునకు పత్నివిగను, సురసరిః =దేవతలచే ఆశ్రయింపబడినదానివిగా, ఇహ వ్యాపినీ= ఈ లోకములో వ్యాపించియున్నదానివిగానున్న నీవు, శృంగే శృంగే=(గొప్ప స్థలములగు) పర్వతశిఖరములలో, యజ్ఞే యజ్ఞే =(గొప్ప కార్యములగు యజ్ఞములలో) వ్యతిష్ఠాః= వెల్గుదానివి అగుచున్నావు.

ఈ రెండు మంత్రములతో వేదపురుషుడు భూదేవిని కీర్తించుచున్నాడు. ఈ రెండును కలిపి ఒకే వాక్యము. ఒకే అన్వయమును కల్గినవి. మొదటి మంత్రమును తిరుమఙ్గైయాళ్వార్లు తాము అనుగ్రహించిన శిఱియ తిరుమడల్ అను ప్రబంధములో – **"కారార్‌వరైక్కొఙ్జై క్కణ్ణార్ కడలుడుక్కై, శీరార్ శుడర్ శుట్టి శెజ్గలులిప్పేరాత్తు, ప్పేరారమార్విల్ పెరుమామళైక్కూన్దల్, నీరార వేలి నిలమఙ్గై"** అనుచు వ్యాఖ్యానించిరి. ఉత్తమనాయికకు ఉండదగిన శుభలక్షణములను చక్కగా కల్గియున్నది ఈ భూదేవి అనుటను నిరూపించుచు ఈ రెండు మంత్రములు ఆ దేవిని కీర్తించుచున్నవి. **(సముద్రవతీ)** – కడలిని వసనముగా కల్గినది. **"సముద్రాంబరా"** అనికదా భూదేవి తిరునామము. ఈ అర్థమునే **"కణ్ణార్ కడలుడుక్కై"** తిరుమఙ్గైయాళ్వార్లు అనుచు ద్రావిడీకరించిరి. తన తిరుమేనికి తగినట్లు చల్లని, మృదువైన, చూచువారి కన్నులను సంతోషముతో నిండించు అందమును కల్గినదిగాకదా సముద్రము అనెడి మేఘవర్ణపు వసనముండును.

**(సావిత్రీ) – "సవితా"** అనుపదము సూర్యుని బోధించుటచే, సూర్యుని తిలకముగా కల్గినది అని అర్థము. **"శీరార్ శుడర్ శుట్టి"** అని తిరుమఙ్గైమన్నన్ కూడ పల్కిరికదా! అందమైన కాంతిని కల్గిన ఆదిత్యుని తిలకముగా కల్గినది. **"చక్షోః సూర్యో అజాయత"** అనునట్లు సర్వేంద్రియప్రధానము నయనమగుటచే, ఇంద్రియతిలకమగు అతని కన్నునుండి పుట్టినది ఈమెకు తిలకమైనది కాబోలు! **"సవితా"** అనునది సకలలోకశ్రేష్ఠుడగు పరమపురుషుని తెలుపునదిగా గ్రహించినపుడు అతని పత్ని అగుటచే భూదేవి సావిత్రి అగుచున్నది అను అర్థమునుకూడ చెప్పవచ్చును.

వర్ణవసనము, తిలకమును ఈమె సౌభాగ్యమునకు చిహ్నములు కదా! ఈ దేవికి ఇట్టి సౌభాగ్యమును అనుగ్రహించు నాథుదెవడు? అనినచో, **(అనో దేవీ) – "అవ-రక్షణే"** అను ధాతువునుబట్టి ఈ ప్రయోగము సర్వరక్షకుడగు ఆ సర్వేశ్వరుడే ఈమెకు నాథుడు అను అర్థము నిచ్చును. దీనివలన భూదేవిభర్త సర్వరక్షకుడగు శ్రీమన్నారాయణుడే అని వేదము చాటినట్లయినది. ఈమె విశిష్టనామ మేది? అనగా –

**(మహీ)** మహత్త్వమును కల్గినది అగుటచే **"మహీ"** అనునది ఈమెకు విలక్షణనామము. **"క్షమయా పృథివీసమః"** (ఓర్పు అనెడి గుణములో భూమికి సాటివచ్చువాడు) అని కీర్తింపబడు గుణమహిమను కల్గినది అగుటచే "గొప్పది" అను అర్థమిచ్చు ఈ నామమును కల్గినది. మన కంటికి ఎదురుగా కన్పించు బ్రహ్మాండమైన రూపమును కల్గినది అగుటచే **"మహీ"** అను పేరును పొందినది. **(మహీ)** ఆవరణజలమే ఎల్ల అగునట్లు కల్గియున్నది. **"నీరార వేలి"** అని తిరుమఙ్గైయాళ్వార్లును ఈ అర్థమును పల్కిరి. ఈమెకుగల మఱికొన్ని వైలక్షణ్యములు ఇకపై తెలుపబడుచున్నవి. **(అంగీ)** – పొగడబడు అంగములను కల్గినది ఈమె. **"రాఘవో-ర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (రాఘవుడు వైదేహి అనబడు జానకీదేవికి తగినవాడు, నల్లని కన్నులనుకల ఆమెయు అతనికి తగినది) అనునట్లు సర్వాంగసుందరుడై, **"స్వక్షఃస్వంగః"** (అందమైన నేత్రములను కలవాడు. అందమైన అంగములను కలవాడు) అనబడు అతనికి తగినదియై, సర్వాంగసుందరియైయున్నది అని తాత్పర్యము. ఈ పదముయొక్క అర్థమునే తిరుమఙ్గైమన్నన్ **"కారార్ వరై క్కొఙ్జై క్కణ్ణార్ కడలుడుక్కై, శీరార్ శుడర్ శుట్టి శెజ్గలులిప్పేరాత్తు, పేరార మార్విల్ పెరుమామళైక్కూన్దల్, నీరారవేలి"** (మేఘములు నిండుగా వ్యాపించిన వనగిరి, వేంకటాద్రి, అను పర్వతములను రెండింటిని రెండు స్తనములుగా కలిగినది, వ్యాపించిన విశాలమైన సముద్రమును వసనముగా కలిగినది, అందమైన కిరణములు గల సూర్యుని తిలకము అను ఆభరణముగా కలిగినది, ఎఱ్ఱని, కలిగియున్న గొప్పకావేరినది జలమును గొప్ప హారముగా దాల్చిన వక్షస్సును కల్గినది, పెద్ద నల్లని మేఘములనెడి కేశములను కల్గినది, ఆవరణజలమును రక్షగా కల్గినది) అనుచు శిఱియతిరుమడల్‌లో వ్యాఖ్యానించిరి.

**(అంగీ) – "కారార్ వరై క్కొఙ్జై"** అని కీర్తింపబడు పర్వతరూప స్తనములను కల్గినది. కాఠిన్యము, ఔన్నత్యము, అగ్రభాగమున నల్లని వర్ణమును కల్గియుండుట, నాథుడు విశ్రమించుచోటు అగుట అను లక్షణములను పూర్ణముగా కల్గినవి కావున కీర్తింపతగిన పర్వతములను స్తనములను కల్గినది ఈమె అని ఈ పదముయొక్క భావము. **"భూమనిందాప్రశంసాసు"** అనునట్లు ప్రశంసార్థమున ఇచటి ప్రత్యయము వచ్చినది. **(అంగీ) – "శెజ్గలులి ప్పేరాత్తు ప్పేరార మార్వ్వు"** అని కీర్తింపబడిన అంగమును కల్గినది. పర్వతములనుండి వెలువడు మణులను, సువర్ణమును, చందనాదికములను

కొట్టుకొనివచ్చుచు, కలగిన నీటిని కల్గినదియై, పల్లపుప్రదేశములవైపు ప్రవహించుచు వచ్చు నదులు అనెడి, చందన దిగ్ధమైన, బంగారముతో, మణులతో చేయబడిన హారములనుకల వక్షఃస్థలమును కల్గినది.

**(అంగీ)–"హిరణ్యకేశః"** అనుచు వేదముచే పొగడబడిన కేశపాశమునుకల కేశవుడగు అతడు అభినివిష్టచిత్తుడగునట్లు, గొప్ప మేఘవర్ణమునుకల కేశములనెడి అవయవమును కల్గినది. ఇంద్రధనుస్సు, మెఱపు అనెడి కదంబమాలను కల్గి, దట్టముగా,పెద్దదిగానున్న, నల్లని మేఘములే ఈమెకు కేశములగుచున్నవి. ఈ రీతిలో మిగిలిన ఈమె మిగిలిన అంగములనుకూడ ఊహించు కొననగును. **(మహః)** మహనీయమైయున్నది. అందఱిచే **"పుడమి తల్లి"** అని కీర్తింపబడునది. ఇట్లు కీర్తించుటకేమి కారణము? అనినచో, అందులకు సమాధానము ఇకపై తెలుపబడుచున్నది. **(ధరణీ)** – అందఱిని ధరించునది (మోయునది) ఈమె. **(మహః)** మనము కన్నులతో దర్శించు ప్రాకృతరూపము మాత్రమే కాదు, తేజోరూపమైన, అప్రాకృతమైన దివ్యమంగళ విగ్రహమును కల్గినది. **(విభీషణీ)** తనను ఆశ్రయింపనివారికి మిక్కిలి భయమును కల్గించునది. సుడిగాలి, అతివృష్టి–ఇత్యాది ఉత్పాతములను కలుగజేసి, వారిని దండించునది. ఇట్లు ఈమెయొక్క పూర్వోక్తవైలక్షణ్యములకు, ఇకపై చెప్పబోవు వైలక్షణ్యములకును గల హేతువు ఇపుడు ప్రస్తావింపబడుచున్నది. ఆ కారణమేమి? అనగా–

**(ఇంద్రపత్నీ) – "ఇది –పరమైశ్వర్యే"** అని ధాతువు అగుటచే, ఇంద్రశబ్ద మిచట పరమైశ్వర్యమునుకల పరమపురుషునకు వాచకము. ఇట్లు ఇంద్రశబ్దవాచ్యుడగు పరమాత్మ యొక్క పత్ని కావున ఈమెకీ వైలక్షణ్యములు సిద్ధించినవి. **(వ్యాపినీ)– "అంత ర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య"** అనునట్లు సర్వవ్యాపకుడగు స్వామికి ఒక విధముగా తగియుండునది అని చెప్పునట్లు రూపగుణవిభూతులతో వ్యాపించియుండునది. జీవకోటికి చేరిన ఈమె స్వరూపము అణువే అనునది సర్వసమ్మతమగుటచే, ఇచట తెలుపబడిన వ్యాప్తి స్వరూపవ్యాప్తి కాదు. **"తథా భూమి శ్చ నీళా చ శేషభూతే మతే మమ, స్వరూపత స్తు న తయో ర్గుణతో వ్యాప్తి రిష్యతే"** (లక్ష్మీదేవివలెనే భూదేవి, నీళాదేవులును భగవానునకు శేషభూతలు అనునది నా సిద్ధాంతము. కాని, వారికి స్వరూపవ్యాప్తి లేదు. గుణవ్యాప్తియే కలదు) అనెడి ప్రమాణము ఇచట స్మరణీయము. ఈమెయొక్క రూపగుణవిభూతులు వ్యాపించియుండుట ఎవరును దర్శింపవీలుకాని నిత్యవిభూతిలోనా? అనినచో, **(ఇహ వ్యాపినీ)** – ఈ లీలావిభూతిలో ఈమె రూపగుణవిభూతులు వ్యాపించియున్నవి–అని భావము. **(సురసరిః)** దేవతలచే ఆశ్రయింపబడునది. దేవతలు అసురనిరసనము కొఱకు భూదేవిని పురస్కరించుకొని, భగవానుని ఆశ్రయించుట పురాణములలో ప్రసిద్ధమేకదా! అమ్మా! ఇట్టి నీవు –

**(శృంగేశృంగే యజ్ఞే యజ్ఞే వ్యతిష్ఠః)** – పర్వతశిఖరములన్నిటియందు విశేషముగా వెలుగుచున్నావు.

**(శృంగే శృంగే వ్యతిష్ఠః)** గొప్ప గొప్ప స్థానములనెడి పర్వతశిఖరములలో విశేషముగా వెలుగుచున్నావు. **"మలైముళఞ్జిల్ మన్నిక్కిడన్దుఱఙ్గుమ్ శీరియశిఙ్గమ్"** (పర్వతగుహలో స్థిరముగా నిద్రించు గొప్ప సింహము) అని కీర్తింపబడు స్వామి విశ్రమించుచోటు అగుటచే ఆ పర్వత శిఖరములలో విశేషముగా వెలుగుచున్నావు. **(యజ్ఞే యజ్ఞే వ్యతిష్ఠః) – "ఇంద్రపత్నీ"** అని కీర్తింపబడుటచే **"పత్యు ర్నో యజ్ఞసంయోగే"** అనెడి న్యాయమునుబట్టి సృష్టిసంహారాది సకలయజ్ఞములందును అతనితో కూడియుండి వెలుగుచున్నావు. యజ్ఞపురుషుడగు అతనితో కూడియుండి, సకలయజ్ఞములలో ఆరాధింపబడు దానివిగా వెలుగుచున్నావనియును భావము. **(శృంగే శృంగే యజ్ఞే యజ్ఞే వ్యతిష్ఠః)**– యజ్ఞవరాహస్వామి పత్నికదా ఈమె. ఈ వరాహస్వామి నివసించు పర్వతశిఖరములలో, యజ్ఞభూములలో వెలుగుచున్నావు.

**(శృంగే శృంగే వ్యతిష్ఠః)** నీ నాథుడు విశ్రమించి, ఆనందించు స్తనములగు తిరువేంకటాచల శిఖరములో, తిరుమాలిరుమ్‌శోలై అనబడు వనగిరి శిఖరముతో నీవు కాంతిని పొంది ప్రకాశించుచున్నావు. **(యజ్ఞే యజ్ఞే వ్యతిష్ఠః)** జనకచక్రవర్తి యజ్ఞభూమిలో సీతాదేవి అనెడి లక్ష్మి అంకురించు క్షేత్రముగను, శ్రీవిష్ణుచిత్తుల నందనవన కైంకర్యయజ్ఞభూమిలో గోదాదేవిగా అవతరించియు నీవు వెలుగుచున్నావు. ఇట్టి నీవు మమ్ములను కాపాడవలెనని భావము.

**(11) వాయుమతీ జలశయనీ శ్రియం ధారాజా సత్యం ధోపరి మేదినీ సోపరి ధత్తంగాయ ॥**

వాయుమతీ =వాయువును (ఊపిరిగా) కల్గినదియై, జలశయనీ= జలమును శయ్యగా కల్గినదియై, శ్రియం ధారా= సంపదను ధరించియున్నదియై, అజా =జన్మరాహిత్యమును కల్గినదియై, అంధోపరి= సతీ= అజ్ఞానులగు సంతానముకొఱకై ఉన్నదియై, సా =అట్టి గొప్పతనమునుకల, మేదినీ =భూమి, అంగాయ= పరమపురుషుని ఆశ్రయింపజేయుటకై, ఉపరి =తనపై, ధత్త =ప్రాణులనన్నిటిని ధరించుచున్నది.

పూర్వమువలెనే భూదేవిని స్తుతించుచు, ఆమెయొక్క మోక్షమును పొందింపజేయు స్వభావమును ఈ మంత్రములో వేదపురుషుడు కీర్తించుచున్నాడు.

**(వాయుమతీ)** వాయువు అనెడి ఊపిరిని కల్గినది. గత మంత్రములలో ఒక ఉత్తమనాయికగా వర్ణింపబడినదికదా ఈమె. ఆ విషయమే ప్రకృతమంత్రములోకూడ అనువర్తించుచున్నది. గంధవహుడగు వాయువును ఊపిరిగా కల్గినది. **(జలశయినీ)** –ఆవరణజలమును పడుకగా కల్గినది. **"నీరార వేలి నిలమఙ్గై"** అనిరికదా తిరుమఙ్గైమన్నన్. శరీరసౌకుమార్యమునకు తగిన శైత్యము మొదలగువానిని కల పడుకను కల్గినది. నాయకుని శయ్యయే నాయికకిని పడుకగా అగుటకదా యుక్తము. జలశాయి అగు అతని శయ్యయే ఈమెకును పడుక అయినది.

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః, తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః" (జలమునకు నారమని పేరు. నశింపనివాడగుటచే నరుడనబడు పరమాత్మునివలన జన్మించినదికదా జలము. నారమనెడి ఆ జలము ఇతనికి పూర్వము స్థానమగుటచే, ఇతడు నారాయణుడనబడుచున్నాడు) "సృష్ట్వా నారం తోయ మంతః స్థితో - హం తేన స్యా న్మే నామ నారాయణేతి" (వరాహపురాణము) (నారమనెడి జలమును సృష్టించి, నేను దానియందుండినవాడనగుటచే నారాయణుడను పేరు నాకు కల్గినది), "నడుక్కడలుళ్ తుయిన్ఱ నారాయణనే" (సముద్రమధ్యమున నిద్రించు నారాయణుడు- తిరువాయ్‌మొళి) అనునట్లు ఆవరణజలము అతనికి శయ్యకదా! అదియే ఉత్తమనాయకి అగు ఈమెకును పడుకగా అయినది. **(శ్రియం ధారా)**-సంప్రదూపమైన శ్రీదేవిని తన గర్భములో ధరించియున్నది. లక్ష్మీదేవికిని అంకురించు చోటుగానున్నదని భావము. లేక, శ్రీరామావతారములో లక్ష్మీస్వరూపిణి అగు సీతాదేవికి తన గర్భములో దాల్చియున్నది అనియును భావము. **"అద్భ్యః పృథివీ"** (జలమునుండి భూమి పుట్టినది) మొదలగు వేదవాక్యములు భూమికి ఉత్పత్తి కలదని తెలుపుచున్నవికదా! ఈమెకూడ మనవలె జన్మను కల్గినదియా? అనినచో, **(అజా)** జన్మలేనిది ఆ వేదవాక్యములు ఈమె శరీరమునకు సంబంధించిన జన్మను తెలుపుచున్నవి తప్ప, ఈమె (ఆత్మ) జన్మను తెలుపుట లేదు-అని భావము.

**(అంధోపరి సతీ)** జ్ఞానములేని తన సంతానము కొఱకే సత్తను పొందినది. జ్ఞానమనెడి నేత్రమే నిజమగు నేత్రమని చెప్పదగియుండుటచే, జ్ఞానహీనులు ''అంధులు'' అనబడుచున్నారు. తల్లికి ఎల్లప్పుడు జ్ఞానములో, అంగములో కొఱతనుకల సంతానముపట్ల మిగిలిన పిల్లల విషయములోకంటె వాత్సల్యము అధికముగా నుండును అట్లే, ఈ భూమాతయును జ్ఞానహీనులగు తన సంతానముకొఱకే ప్రాణములను దాల్చియుండును. ఈమెకు తన జ్ఞానశూన్యులగు తన పిల్లలపట్ల ప్రేమ మిక్కిలిగానుండుననుట ఎచట గమనింపనగును? అనినచో,

**(సా మేదినీ)** – "నా కన్నులు పోయినవి" అనుచు వేదరూపమగు చక్షువులను కోల్పోయిన బ్రహ్మకొఱకు పరమపురుషుడు మధుకైటభులను వధించినపుడు తన శరీరమును మలిన పఱచుకొనికూడ, బ్రహ్మకు వేదరూపనేత్రములను ప్రసాదించిన కార్యములను గమనించితిమి కదా! **"మేదినీ"** – మధుకైటభుల మేదస్సు అను మాంసప్రవాహముతో పూయబడినది అని ఈ పదముయొక్క అర్థము. బ్రహ్మాదుల విషయములో మాత్రమేనా ఈమె వాత్సల్యము అధికముగా నుండును? అనినచో,

**(అంగాయ ఉపరి ధత్త)** అకారవాచ్యుడగు సర్వేశ్వరుని పొందింపజేయుటకు ప్రాణులనందఱను (వారు చేయు అపరాధములను అన్నిటిని అతడు గమనింపకుండ) తన పైననే ధరించుచున్నది. ఈ తల్లి–అని భావము. సర్వప్రాణుల విషయమున ఈమె వాత్సల్యరసప్రవాహము ఉత్కటముగా ప్రవహించునని హృదయము.

**(12) విష్ణుపత్నీం మహీం దేవీం మాధవీం మాధవప్రియామ్ ।**
**లక్ష్మీప్రియసఖీం దేవీం నమామ్యచ్యుతవల్లభామ్ ॥**

మాధవీం= మాధవునకు పత్ని అగుటచే **"మాధవి"** అని పిలువబడునది, మాధవప్రియాం =లక్ష్మీనాథునకు మిక్కిలి ఇష్టమైనది, లక్ష్మీప్రియసఖీం =శ్రీదేవికి ప్రియసఖి, దేవీం =రూపగుణములతో ప్రకాశించునది, అచ్యుతవల్లభాం =అచ్యుతుని ప్రియనాయకునిగా కల్గినది, విష్ణుపత్నీం =విష్ణువునకు ప్రియపత్నియును అగు, మహీం దేవీం =భూదేవిని, నమామి =నమస్కరించుచున్నాను.

శ్రీమన్నారాయణునకు, భూదేవికిని మధ్యగల పలువిధములైన సంబంధములను ప్రస్తావించుచు, ఆ స్వామి శ్రీపాదములలో శరణాగతిని చేయుట ఇందలి విషయము. అర్థస్వారస్యమునుబట్టి **"విష్ణుపత్నీం మహీం దేవీమ్"** అనుటను వాక్యము చివరగల **"నమామి"** అను క్రియతో అన్వయింపనగును. **(మాధవీమ్)** మాధవునకు పత్ని అగుటచే **"మాధవి"** అని పిలువబడు దేవిని. మాధవుడు లక్ష్మీనాథుడు లక్ష్మీనాథునకు పత్ని అగుటచే సర్వేశ్వరునకు శ్రీదేవి మాత్రమే పట్టమహిషి అనుటయు, ఈ భూదేవి ద్వితీయభార్యయే అనుటయును తెలియుచున్నది. లోకములో భార్యగానున్న వారందఱును తమ భర్తకు విధేయురాండ్రుగను, ఆనందమును కల్గించువారుగను నుందురని చెప్ప వీలులేదు. ఇచట కూడ అదియే స్థితియా! అనినచో,

**(మాధవప్రియామ్)** మాధవునకు ప్రియమైనది. లక్ష్మీనాథునకు ప్రియమైయుండుననుట వలన, భగవానుడు లక్ష్మీదేవితో ఆనందించునపుడు ఆ దేవియొక్క స్తనబాహుదృష్టులవలె, పూలమాల, చందనము మొదలగునవివలెనుండి, ఇద్దఱికిని మాధుర్యమును కల్గించునది ఈ దేవేరి అనునది తెలుపబడుచున్నది. ఈ విషయములో సాపత్న్యము **(సవతుల పోరు)** లేదని ఏర్పడుచున్నవి. **"తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్ శేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్దవారెన్కొల్? తిరుమకళ్ మేల్ పాలోదమ్ శిన్ద పడనాకణై క్కిడన్ద మాలోదవణ్ణర్ మనమ్"** (క్షీరాబ్ధితరంగములు చెదురుచు తుంపురులు పైనపడుచుండగా, పడగలను గల ఆదిశేషుడను పడుకపై పవళించిన, గొప్పసముద్రము వంటి తిరుమేనిని కలవానికి శ్రీదేవి పైగల మనస్సు, శ్రీదేవి, భూదేవి, నీళాదేవియు సంశ్లేషించినప్పుడు శ్రీదేవి విషయముననే మిక్కిలి ప్రీతితో నుండుట ఎట్లో కదా? ముదల్–42) అనుచు సరోయోగి సంధించిన ప్రశ్నకు బదులుగా శ్రీపరాశరభట్టారకులు శ్రీగుణరత్నకోశమను స్తోత్రములో **"భోగ్యా వామపి నాంతరీయకతయా పుష్పాంగరాగై స్సమం నిర్వృత్తప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్, దేవి త్వా**

**మను నీళయా సహమహీ దేవ్య స్సహస్రం తథా యాభి స్త్వం స్తనబాహుదృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"** (26) (దేవీ! నీకు విధేయలై, నీ నాథునకు పత్నులైయున్న భూదేవి, నీళాదేవి మొదలగు వేలాదిగా నున్న పత్నులు, మీకిరువురకును పుష్పము, అంగరాగము మొదలగువానివలె విడచియుండని ఉపకరణములై, భోగ్యభూతలైయుండువారై, మీ ప్రణయరసము కట్టలు తెంచుకొని ప్రవహించునపుడు, దానిని వెలువరించు ప్రవాహములవలె నుండువారై యుందురు. నీ కన్నులు మొదలగువానితో నీ నాథుని నీవు ఆనందింపజేయునట్లు, వారిని గొని నీవు అతనిని ఆనందింపజేయుదువు) అని అనుగ్రహించిరి కదా! ఇట్లు మాధవునకు ప్రియురాలైయుండుటకు కారణమేమి? అనగా,

**(లక్ష్మీప్రియసఖీమ్)** – శ్రీదేవికి ప్రియసఖియైయుండు భూదేవిని– అని అర్థము లక్ష్మీదేవియొక్క ఆనందమునకు ప్రథమపాత్రమైయుండునది అని సారము. ఆమెకు ప్రియమైనది అగుటచే ఆమెకు ప్రియుడగు స్వామికిని ప్రియురాలైయుండవలెనుకదా! తనకు ప్రియమైన వస్తువులకంటె, తన నాయకికి ప్రియమైన వస్తువుల విషయమున ప్రీతి మించియుండుట కదా ఉత్తమనాయకి లక్షణము. **(మాధవప్రియాం లక్ష్మీప్రియసఖీం)** ఈ భూదేవి **"శ్రియః శ్రీః"** అని **"తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా"** అనియును కీర్తించు రీతిలో లక్ష్మీదేవికి లక్ష్మియైనవాడగు పరమపురుషునకు, లక్ష్మికిని ప్రియమైయున్నచో, శ్రీదేవి–భూదేవుల మధ్య సాపత్న్యము (సవతుల మధ్య పోరు) లేకున్నచో **"అళక్కుమ్ కరుఙ్గడల్ వెణ్డిరైక్కే కొణ్డుపోయలర్ వాయ్ మళక్కణ్ మడన్దై అరవణైయేఱ మణ్మాదర్ విణ్వాయ్ అళైత్తుప్పులమ్బి ములైమలైమేల్ నిన్ఱు మాఱుకళాయ్ మళైక్కణ్ణ నీర్ తిరుమాల్ కొడియానెన్ఱు వార్కిన్ఱతే"** (తామరపూవులో అవతరించినది, వర్షమువలె చల్లని కటాక్షమును కల్గినది అగు శ్రీదేవిని ఘోషించు, నీళావర్ణమును కల సముద్రములో తెల్లని అలల మార్గమున తీసికొని పోయి ఆదిశేషుడనెడి పడుకను అధిరోహించినప్పుడు, భూదేవి 'శ్రియఃపతి కఠినుడు' ఆకాశమను నోటితో అరచి, ఏడ్చి, పర్వతములనెడి స్తనములనుండి వర్షధారలనెడి కన్నీళ్లను నదులుగా ప్రవహింపచేయుచున్నది.) అని అనెడి తిరువిరుత్త ప్రబంధములోని పాశురములో లక్ష్మీదేవి పరమపురుషుని పాలసముద్రములో నాగశయనమునకు కొనిపోయి, అతనితో కూడియుండుటను చూచి ఆకాశమనెడి నోటితో, అఱచి ఆక్రోశించి, "ఈ లక్ష్మీనాథుడు కఠినుడు" అని పల్కి స్తనములనెడి పర్వతముపై నుండి నదులనెడి కన్నీటిని భూదేవి కార్చుచున్నది. –అని నమ్మాళ్వార్లు అనుగ్రహించుటకు ఏమి కారణము? అనినచో,

శ్రీమద్యామునులకు ముందున్న ఆచార్యులు "లక్ష్మీదేవికిని, పరమపురుషునకును కలయిక ఏర్పడినపుడు, మాల, చందనము మొదలగువానివలె నేను కూడ ఉపకరణకోటిలో నుండవలసియుండగా, నన్ను అట్లు స్వీకరింపకుండనున్నాడే! అని బాధపడి, ఆక్రోశించుచున్నది–అని ఈ ప్రశ్నను సమాధానించిరట. ఈ నిర్వాహమునందు కూడ భూదేవికి తాను స్వామితో కలసియుండలేదు కదా! అను బాధ ఉన్నట్లు స్ఫురించుటచే, శ్రీయామునులు ఇంకొక రీతిలో సమాధానమును నిర్వహించిరి. అది ఎట్లనగా **"వడివిణైయిల్లా మలర్మకళ్"** – (రూపసౌందర్యమున సాటిలేని లక్ష్మీదేవి) అని కీర్తింపబడు లక్ష్మీదేవిని ఈ సముద్రమధ్యములో మునిగిపోవునట్లు కొనిపోవుటయా! పడుకవంటిదాననగు నేను ఇచటి ఉండగా!" అని భూదేవి తపించుచున్నది అనునది శ్రీయామునుల నిర్వాహము. ఈ రెండు నిర్వాహములందును భూదేవిని విడిచి సర్వేశ్వరుడు, శ్రీదేవియు వెడలిరి అని పల్కుట వారి గుణవైభవమునకు తగనిది అని భావించిన పరాశర భట్టర్ ఈ పాశురమును ఈ క్రింది విధముగా వ్యాఖ్యానించిరి. ఈ పాశురము **"కాలమయక్కు"** అను ద్రావిడాలంకార ప్రక్రియకు సంబంధించినది.

నాయకుడగు భగవానుడు వర్షాకాలము నాటికి తిరిగి వచ్చెదనని సమయనిర్దేశమును చేసి, వెడలెను. కాని, ఆ సమయము సమీపించినను తిరిగి రాలేదు. వర్షము ధారాపాతముగా కురియుటను చూచిన నాయకి "నా ప్రియుడింకను రాలేదుకదా" అని బాధపడినది. ఆమెను ఊరడించుటకై ఆమె చెలికత్తె "ఇంకను వర్షాకాలము రాలేదుసుమా! నీవు చూచునది వర్షము కాదుసుమా! భగవానుడు, లక్ష్మీదేవియును తనను విడచివెడలుచున్నారే! అను బాధతో భూదేవి విడచుకన్నీరుకదా ఇది! ఇట్లు ఆమె కన్నీరు నదులై ప్రవహించుచున్నది." అనుచు కాలమును గూర్చి భ్రమ కలుగజేయుచున్నది. ఇది భ్రమను కల్గించు పాశురమగుటచే ఇందు చెప్పబడిన అర్థములు అన్నియు వాస్తవములుగా నుండవలెనను నియమము లేదు. లక్ష్మీదేవికి, భూదేవికినిమధ్య సాపత్న్య (దోష)మే లేనపుడు, అది ఉన్నట్లు పల్కుట వాస్తవమగునా? అని నాయకి విచారించి, నిర్ణయించుకొను లోపలనే నాయకుడు తిరిగి వచ్చును అను నమ్మికతోనే సఖి ఈ పాశురమున ఇట్లు పల్కినది. కావున అర్థమున ఎట్టి వైరుధ్యమును లేదు–అనుచు భట్టరు వివరించిరట. అందుచే లక్ష్మీ దేవి భూదేవులమధ్య సాపత్న్యము లేదు.

లక్ష్మీదేవికి ఇష్టమైనది అను ఆకారముతో మాత్రమేనా భూదేవి భగవానునకు ప్రియమైయుండును? అనినచో, **(దేవీమ్)** – ఆత్మగుణములతోను, దేహగుణములతోను ప్రకాశించునది అగుటచేతను స్వామికి ఇష్టమైనది–అని తాత్పర్యము. **"ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి, గుణా ద్రూపగుణా చ్చాపి ప్రీతి ర్భూయో - భ్యవర్ధత"** (తండ్రి అగు దశరథునిచే వివాహము చేయబడినదను కారణముచే రామునకు సీతాదేవి మిక్కిలి ప్రియమయ్యెను. ఆత్మగుణములతో, రూపగుణములతో ప్రీతి మిక్కిలిగా ఆమె యందు వర్ధిల్లినది) అనునట్లు భూదేవి భగవానునకు ప్రియమైయుండుట మాత్రమేనా! అతడు ఈమెకు ఇష్టుడుకాడా? అనినచో, అందులకు సమాధానము పిమ్మట తెలుపబడుచున్నది. –**(అచ్యుతవల్లభామ్)** అచ్యుతుని ప్రియునిగా కల్గిన దానిని అని అర్థము.

**"నిలమామకట్కు ఇనియాన్"** (భూదేవికి ప్రియుడు-పెరియ తిరు-9-10-7) అనిరికదా తిరుమఙ్గైయాళ్వార్లు. **"మాధవాప్రియామ్"** అనుచు అతని మనస్సు ఈమెయందు అభినివేశమును పొందియుండుటను, **"అచ్యుతవల్లభామ్"** అనుచు ఈమె మనస్సు అతనియందు అభినివేశమును పొందియుండుటయును తెలుపబడినవి. **"అస్యా దేవ్యా మన స్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్"** (రా.సు-15) (ఈ సీతాదేవియొక్క మనస్సు ఆ రామునియందు, అతని మనస్సు ఈమెయందును స్థిరముగానున్నది) అని, వాల్మీకిచే **"కాంత స్తే పురుషోత్తమః, ...అరవిందలోచనమనఃకాంతా"** అనియును ఈ అంశము శ్రీయుములచే లక్ష్మీవిషయమున చెప్పబడినది కదా!

ఇట్లు ఒకరికొకరు వల్లభులైయుండుట మాత్రమేనా? అనినచో, అంతియే కాదు, **(విష్ణుపత్నీమ్)** వీరిమధ్య పతిపత్నీభావరూపసంబంధము కూడ కలదు.

**(విష్ణుపత్నీమ్)** విష్ణువునకు పత్నియైయున్నది. **"పత్యు ర్నో యజ్ఞసంయోగే"** అను వ్యాకరణసూత్రప్రకారము జగత్తుయొక్క సృష్టిస్థితిసంహారములు, మోక్షప్రదానము మొదలగు యజ్ఞములలో అతనితో కూడియుండునది-అని తాత్పర్యము. సృష్టిమొదలగు వానిలో, తన యొక్క ప్రకారమగు భూమిని విషయముగా చేయుటద్వారా, మోక్షప్రదానములో పురుషకార కృత్యమును చేయుటద్వారా ఈమె అన్వయించుచున్నది కదా! **"మాధవీమ్"** అని ఈమె మాధవునకు చెందినదనుట తెలుపబడినది. **"మాధవప్రియామ్"** అని అతనికి ప్రియమైనదనుట తెలుపబడినది. **"లక్ష్మీప్రియసఖీమ్"** అని లక్ష్మిదేవికి ఇష్టసఖి అగుట తెలుపబడినది. **"దేవీమ్"** అని రూపగుణములను కల్గినదని తెలుపబడినది. **"అచ్యుతవల్లభామ్"** అని అతడు ఈమెకు వల్లభుడనుట తెలుపబడినది. **"విష్ణుపత్నీమ్"** అని స్వామితో పత్నీత్వసంబంధమును కల్గియుండుట తెలుపబడినది. ఇట్టి దేవేరి ఎవరు? అనినచో -

**(మహీం దేవీమ్)** భూదేవియే. ఇట్టి వైశిష్ట్యములను కల్గినది అగుటచే **"మహీ"** అని విశేషింపబడినది అనగా, "మహీ" అను అన్వర్థనామమును కల్గినదని భావము. **"మహ-పూజాయామ్"** అని ధాతువు **(నమామి)** - ఇట్టి భూదేవికి నమస్కరించుచున్నాను. భూదేవికి భగవానునితోకల పలు రీతులలోని సంబంధములను పురస్కరించుకొని, వానిని స్మరించుచు, కీర్తించుచు, ఆమె పాదములందు వేదపురుషుడు పురుషకారముకొఱకు శరణాగతిని చేయుచున్నాడు. **"ఇయం సా యత్కృతే రామః చతుర్భిః పరితప్యతే, కారుణ్యేనానృశంస్యేన శోకేన మదనేన చ, స్త్రీప్రణష్టేతి కారుణ్యాత్, ఆశ్రితేత్యానృశంస్యతః, పత్నీ నష్టేతి శోకేన, ప్రియేతి మదనేన చ"**(రా.సు-15) (ఎవరికొఱకు శ్రీరాముడు కరుణ, ఆనృశంస్యము, శోకము,కామము -అను నాల్గింటిచే బాధింపబడుచున్నాడో ఆ సీతాదేవియే ఈమె. శ్రీరాముడు -ఒక స్త్రీ అపహరింపబడినదే అను కారుణ్యముతో, పత్ని అపహరింపబడినదే అను శోకంతో, ప్రియురాలు అపహరింపబడినదే అను ఆనృశంస్యముతో, నన్ను ఆశ్రయించినది అపహరింపబడినదే అను కామముతో పరితాపపడుచున్నాడు) అనునపుడు సీతాదేవికి భగవానునితోకల పలు సంబంధములు తెలుపబడినట్లే, ఇచటను భూదేవికి భగవానునితో కల పలు సంబంధములు చెప్పబడినవి.

**(13) ఓమ్ ధనుర్ధరాయ(యై) విద్మహే సర్వసిద్ధ్యైచ ధీమహి ।**
**తన్నోధరా ప్రచోదయాత్ ॥**

ధనుర్ధరా(యై)య =వింటిని దాల్చిన దేవుని (దేవిని), విద్మహే =ఉపాసించుచున్నాము. సర్వసిద్ధ్యై చ ధీమహి= (అతనిని పొందుటకు) సిద్ధుల నన్నిటిని అనుగ్రహించునది అగుటచే **"సర్వసిద్ధి"** అనబడు భూదేవిని ధ్యానింతుము, తత్ =ఆ పరబ్రహ్మధ్యానమును, నః=మాకు, ధరా=భూదేవి, ప్రచోదయాత్ =ప్రచోదనచేయునుగాక!

భూమిగాయత్రి అనబడు మంత్ర మిది. మిగిలిన గాయత్రీమంత్రములవలెనే పరమాత్మ ధ్యానమును అభివృద్ధిచేయుటకొఱకు ఈ గాయత్రికి అధిదేవత అగు భూదేవిని ప్రార్థించురీతిలో ఈ మంత్రమున్నది.

**(ధనుర్ధరాయ విద్మహే)** శార్ఙ్గమను వింటిని దాల్చిన దేవుని ఉపాసించుచున్నాము. **"ధనుర్ధరాయై"** అను వేఱొక పాఠమునుబట్టి భూదేవికి వింటినిదాల్చిన రూపమొకటి కలదని భావింపనగును. లేక, ధనూరాశికి అభిమాని దేవత అనియును అర్థమును చెప్పవచ్చును. **"సర్వసిద్ధ్యై చ"** అను ప్రయోగములోని చకారము భూదేవిని సముచ్చీకరించుటచే, **"ధనుర్ధరాయ"** అనెడి పాఠమే మిక్కిలి సంగతమని తోచును.

**(సర్వసిద్ధ్యై చ ధీమహి)** ఆ పరమాత్మయొక్క ఉపాసనకొఱకు సర్వసిద్ధి అనబడు భూదేవిని ధ్యానింతును. ఇహలోకసుఖములను భూమాత మనకు అనుగ్రహించుటను ప్రత్యక్షముగా గమనించుచుండుటచే, పరలోకసుఖము అనెడి మోక్షముకూడ ఈమె పురుషకారము చేతనే సిద్ధించుననుట శాస్త్రసిద్ధము కావునను, భూదేవి **"సర్వసిద్ధి"** అను విశిష్టనామముతో పిలువబడుచున్నది.

**(తత్)** - **"ధనుర్ధరాయ విద్మహే"** అనునపుడు చెప్పబడిన పరమాత్మ ధ్యానమును-అని భావము. **"ధనుర్ధరాయై"** అను పాఠమును అనుసరించి, తన విషయమైన ధ్యానమును -అని భావము. **(నః)** అనన్యగతికులమగు మనకు అని ఇచటి సర్వనామశబ్దముచే ద్యోతితము.

**(ధరా)** - మనలను ధరించియున్న భూమాత. **(ప్రచోదయాత్)** - ప్రేరేపించునుగాక **"ధనుర్ధరాయ విద్మహే సర్వసిద్ధ్యై చ ధీమహి"** అనుటచే భూదేవితోకూడిన పరమపురుషుడు ప్రాప్యుడు అను అర్థమును, **"తన్నో ధరా ప్రచోదయాత్"** అనుటచే ఈ ప్రాప్యమును పొందుటకు పురుషకారమును చేయునదియై భూదేవి ఉన్నదను అర్థమును తెలుపబడినవి.

**(14) శృణ్వంతి శ్రోణా మమృతస్య గోపాం
పుణ్యా మస్యా ముపశృణోమి వాచమ్ ।
మహీం దేవీం విష్ణుపత్నీ మజూర్యాం
ప్రతీచీ మేనాగ్ం హవిషా యజామః ॥**

శ్రోణాం=శ్రవణానక్షత్రమునకు అభిమాని దేవతయై, అమృతస్య గోపాం=మోక్షమునకు రక్షకురాలైయున్న భూమిని, శృణ్వంతి= (జ్ఞానులు) విందురు. అస్యాం= ఈమె విషయమున, పుణ్యాం వాచమ్ =పవిత్రమైన వాక్కునే, ఉపశృణోమి= ప్రశ్నింతును, విష్ణుపత్నీం =విష్ణువునకు పత్నియై =అజూర్యామ్ =(భగవద్విశ్లేషమువలన ఏర్పడు) విరహతాపము లేనిదియై, (ఏనాడును భగవానుని విశ్లేషింపనిదియై), ప్రతీచీం=నా విషయములో ఆభిముఖ్యమును కల్గినది అగు, ఏనాగ్ం మహీం దేవీం= ఈ భూదేవిని, హవిషా =(మన ఆత్మలను) హవిస్సుతో, యజామః=ఆరాధింతుము.

భూదేవియొక్క కీర్తిని పొగడి, ఆమె సన్నిధిలో తన ఆత్మ అనెడి హవిస్సును సమర్పింతునని వేదపురుషుడు ఇందు పల్కుచున్నాడు.

**(శృణ్వంతి శ్రోణామ్)** శ్రవణానక్షత్రమును జన్మనక్షత్రముగా కల్గిన భగవానుడు ఆ నక్షత్రమునకు అభిమాని దేవత అగునట్లే, అతని పత్ని అగు ఈమెకూడ శ్రవణానక్షత్రమునకు అభిమాని దేవతయైయుండుటచే **"శ్రోణా"** అనబడుచున్నది. **(అమృతస్య గోపామ్)** మోక్షమునకు రక్షకురాలు. ఇచటి అమృతశబ్దము మోక్షార్థకము. నిత్యవిభూతిలో (వైకుంఠములో) కైంకర్యమును వర్ధిల్లజేయునది అగుటచేతను, ఈ లీలావిభూతిలో చేతనులను సంస్కరించి, మోక్షమును పొందుటకు యోగ్య తనువారికి కల్గించునది అగుటచేతను, పరపురుషునివద్ద పురుషకారకృత్యమును చేయుటద్వారా ముక్తవర్గవర్ధకయైయుండుటచేతను మోక్షమునకు రక్షకురాలు అని భావము.

**(అస్యాం పుణ్యాం వాచమ్ ఉపశృణోమి)** ఈమె విషయములో నేను పరిశుద్ధమైన వేద వచనములను పొందుదును. జ్ఞానులు ఆలకించు ఈమె కీర్తిని నేనుకూడ విందునని భావము. **"ఇరైత్తు నల్లమేన్మక్కళ్ ఏత్త నానుమ్ ఏత్తినేన్"** (సత్పురుషులు స్తుతింపగా నేను కూడ స్తుతించితిని-తిరువాయ్-4-3-9) అనిరి కదా నమ్మాళ్వారు. **(మహీం దేవీమ్)** గుణములతో మిక్కిలి గొప్పదిగను, అందుచేతనే ప్రకాశించునదిగను ఉన్న భూదేవిని-అని అర్థము. ఇట్టి గొప్పతనమునకు మూలమేమి? అనినచో,

**(విష్ణుపత్నీమ్)** - విష్ణువునకు పత్నియైయున్నదానిని-అని భావము **"అస్యేశానా జగతః"** (ఈ లోకమునకు ఈశ్వరి) అనుచు నీళాదేవి వైభవమును పొగడి, అందులకుగల కారణమును **"విష్ణుపత్నీ"** అను పదముతో సూచించినట్లే, ఇచటకూడ ఈ పదముతో సూచింపబడినది. పత్నియైనచో ఈమె ఎపుడైనను పతిని ఎడబాసి, విరహతప్త అయిన సన్నివేశముండునా? అనినచో, **(అజూర్యామ్)** విశ్లేషమునకు ఎంతమాత్రము అవకాశము లేకపోవుటచే, విరహతాపముచే తపింపబడనిదానిని -అని అర్థము. **(ప్రతీచీమ్)** - ఆశ్రితులకుగు మన విషయములో ఆభిముఖ్యమును కల్గినదానిని. **(ఏనామ్)** వాత్సల్యముతో మన సమీపములోనే వేంచేసి యున్నదానిని. **(హవిషా యజామః)**-మా ఆత్మరూపమైన హవిస్సుతో ఆరాధింతుము. **"యజ-దేవపూజాయామ్"** అను ధాతువును బట్టి, **"యజామః"** అను ఈ పదము ఆరాధనను తెలుపును. **"మహీం దేవీమ్"** అనుచు గుణవైభవము తెలుపబడినది, **"విష్ణుపత్నీమ్"** అని పురుషకారము ఫలించుటకు అవసరమగు సంబంధము నిత్యమైయున్నదని తెలుపబడినది. **"ప్రతీచీమ్"** అని మనవిషయములోగల అభిముఖ్యము తెలుపబడినది. **"ఏనామ్"** అని సౌలభ్యము తెలుపబడినది. ఇట్లు, వీనిచే పురుషకారస్వరూపిణికి ఆవశ్యకములగు గుణములు అన్నియు ఈమెయందు పొందికగానున్నవనుటను అనుసంధించుచు, ఈమె సన్నిధిలో ఆత్మసమర్పణ రూపశరణాగతి చేయబడినది.

**(15) త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే
మహీం దివం పృథివీ మంతరిక్షమ్ ।
తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా
పుణ్యగ్ం శ్లోకం యజమానాయ కృణ్వతీ ॥**

ఉరుగాయః=గొప్ప కీర్తిని కలవాడగు, విష్ణుః= విష్ణువు, మహీం= గొప్పది అగు, పృథివీం =భూమిని, దివం=దేవలోకమును, అంతరిక్షం= అంతరిక్షలోకమును, త్రేధా =మూడు పాదములను మోపుటద్వారా, విచక్రమే =చక్కగా కొలిచెను, శ్రోణా ఇచ్ఛమానా =కీర్తిని అభిలషించినదియై, యజమానాయ= తనను ఆరాధించువానికి, పుణ్యగ్ం శ్లోకం =పవిత్రమగు కీర్తిని, కృణ్వతీ = కల్గించునదియై, తత్ = ఆ విష్ణువును, ఏతి= పొందుచున్నది.

పరమపురుషునకు భూదేవివిషయమునగల ప్రీతిని త్రివిక్రమావతారవృత్తాంత కథనపురస్సరముగా వ్యక్తీకరించుచు, సూక్తమును వేదపురుషుడు ఈ మంత్రముతో ఉపసంహరించుచున్నాడు. **(త్రేధా విష్ణు రురుగాయో విచక్రమే)** గొప్పగా కీర్తింపబడువాడగు, భగవానుడు అయిన విష్ణువు పాదవిన్యాసములను మూడింటితో కొలిచెను.

**(విష్ణుః విచక్రమే)** విష్ణువు కొలిచెను. విక్రమించెను. **"క్రము-పాదవిక్షేపే"** అని ఇచటి ధాతువు. సర్వవ్యాపియైనవానికి ఇది ఒక లెక్కలోనికి వచ్చునది కాదని ఇచటి హార్దభావము. **(ఉరుగాయో విచక్రమే)** మిక్కిలి కీర్తింపబడువాడై కొలిచెను. సొత్తుదారుడు సొత్తును విడువలేక దానిని కొలుచుటయును, అట్లు కొలుచుటలోకూడ తనను యాచకునిగా చేసికొని, కొలుచుటయును, చూచి లోకులు అందఱు ఇతనిని కీర్తించిరికదా! జాంబవంతుడు మొదలగువారు డప్పును వాయించుచు పొగడు రీతిలోకదా ఇతని కీర్తి గొప్పతనమున్నది. **"సంస్తుత్తై స్సురాణాం దివి భూతసంఘై స్తదా మనుష్యై ర్గగనే చ ఖేచరైః, స్తుతః క్రమాన్ యః ప్రచకార సర్వతో**

**మమాస్తు మాంగల్యవివృద్ధయే హరిః"** (స్వర్గములో దేవసమూహములుచేతను, అట్లే భూప్రదేశములోనుండు మానవులచేతను, ఆకాశములోని ఆకాశసంచారులచేతను, స్తుతింపబడిన ఏ భగవానుడు తన శ్రీపాదములను ఉంచెనో, అట్టి త్రివిక్రమావతారము నెత్తిన ఆ హరి నాకు ఎల్లప్పుడు మంగళములను వృద్ధి అగునట్లు అనుగ్రహించునుగాక) అని విష్ణుధర్మములో చెప్పబడినది కదా! ఇట్లు భగవానుడు కొలిచినది ఎవరిని? అనినచో, **(మహీమ్)** గుణములతో మిక్కిలి గొప్పది అగుటచే **"మహీ"** అనబడు తన మహిషిని కదా తన శ్రీపాదములతో తడవినది-అని భావము.

**(పృథివీమ్) ''పద్భ్యాం భూమిః''** (పాదములనుండి భూమి పుట్టినది) అనునట్లు పాదములనుండి ఉద్భవించి, **"నిలమకళ్ పిడిక్కుమ్ మెల్లడి"** (భూదేవి సంవాహనము చేయు మృదులములైన శ్రీపాదములు - తిరువాయ్-9-2-10) అని కీర్తించిన రీతిలో పాదసంవాహనమునుచేయు స్వభావమునుకల భూదేవిని తన పాదములతో తడవుట యుక్తమే కదా! **"అడిచ్చియోమ్ తలమిశై నీ యణియాయ్ ఆళియమ్ కణ్ణా! ఉన్ కోలపాదమ్"** (స్వామి దాసులమగు మా తలలపై నీ అందమైన పాదములను అలంకారముగా పెట్టుము - తిరువాయ్-10-3-6) అనికదా ప్రేమార్ద్రవిహ్వలులగువారు ఆశపడు రీతి. నాయకుడు నాయకియొక్క అవయవములను ఒక్కొక్కటిని తడవునట్లే, భూదేవియొక్క అవయవములను అన్నిటిని త్రివిక్రమస్వామి తడవుట పిమ్మట తెలుపబడుచున్నది. **(దివమ్ అంతరిక్షమ్ విచక్రమే)** భూదేవి అవయవవిశేషములగు దేవలోకమును, అంతరిక్షలోకమును కొలిచెను. **"ద్యౌ ర్వరిణా అంతరిక్షం మహిత్వా"** అని పూర్వమే దేవలోకము, అంతరిక్షమును భూదేవియొక్క అవయవములని చెప్పబడినదికదా!

**(విచక్రమే)** - దేవతలకొఱకు కొలిచెననుట కేవల వ్యాజము. నిజమునకు తన నాయకిని ప్రేమతో శ్రీపాదముతో తడవుటయే స్వామి ప్రధానోద్దేశ్యము. **"కిడన్దిరున్దు నిన్నళన్దు కేళలాయ్ క్కీళ్పుక్కు ఇడన్దిడుమ్ తన్నుళ్ కరక్కుమ్ ఉమిళుమ్ తడమ్బెరుమ్ తోళార త్తళవుమ్ పారెన్నుమ్ మడన్దైయై మాల్ శెయ్కిన్ఱమాలార్ కాణ్బారే"** (క్షీరాబ్ధిలో శయనించి, పరమపదములో వేంచేసియుండి, వేంకటాద్రిలో నిలచియుండి, వరాహరూపియై క్రిందకు చొచ్చుకొని పోయి, భూమిని ఉద్ధరించి, ప్రళయకాలమున తనలో దాచియుంచి, ప్రళయము ముగియగానే బయటపరచి, విశాలములైన, దీర్ఘములైన తన భుజములతో మనసార తడవుచు భూదేవి విషయమున ఆశ్రితవ్యాముగ్ధుడు చూపిన వ్యామోహమును ఎవరు తెలియగలరు? - తిరువాయ్-2-8-7) అని నమ్మాళ్వార్లు, **"అరవాకి చ్చుమత్తియాల్ అయిలెయిత్తిన్ ఏన్దుదియాల్ ఒరువాయిన్ విళుఙ్గుతియాల్ ఓరడియాల్ ఒళిత్తియాల్ తిరువాన నిలమకళై"** (కంబ-విరాధవతైప్పడలమ్) అని కంబమహాకవియు త్రివిక్రముని అవతారచేష్టితములు అన్నియు భూదేవిపట్ల ఆ స్వామికి కల ప్రేమను వ్యక్తీకరించునవియే అని నిశ్చయించిరి కదా!

**(త్రేధా విచక్రమే)** - మూడు పాదవిన్యాసములతో కొలిచెను. **"ఒణ్మిదియిల్ పునలురువి ఒరుకాల్ నిఱ్ప ఒరుకాలుమ్ కామరు శీరవుణనుళ్ళత్తు ఒణ్మదియమ్ కడన్దు అణ్డమీదు పోకి ఇరువిశుమ్బినూడుపోయ్ ఎళున్దు మేల్, త్తణ్ మదియుమ్ కదిరవనుమ్ తవిరవోడి త్తారకైయిన్ పుఱన్దడవి అప్పాల్ మిక్కు మణ్ ముళుదుమ్ అకప్పడుత్తు నిన్ఱ ఎన్దై"** (ఒక శ్రీ పాదము అందముగా ఒక అడుగు దూరము మోపినంతలోనే అవరణజలమువరకు వ్యాపించి, ఆ చోటు చాలకపోవుటచే నిలువగా, వేరొకపాదము వేరొక శ్రీపాదము గొప్పభాగ్యమున కలవాడగు మహాబలి తనమనస్సులో తలచిన తలపును కూడ దాటి అండభిత్తికి ఆవలివైపుకు కూడ పోయి, దాటి వ్యాపించి వృద్ధిచెంది, గొప్ప ఆకాశమును సైతము వ్యాపించి, ఆ పిమ్మట సూర్యమండలమును, దానికి పైన గల చల్లని చంద్రమండలమును అతిక్రమించి, వానికి పైన గల నక్షత్రమండలము సైతము దాటి వెడలి, ఆ పిమ్మట గల బ్రహ్మలోకమును కూడ వ్యాపించి నిలువగా, భూలోకము మొదలైన పదునాలుగు లోకములను స్వాధీనము చేసికొనిన స్వామి యొక్క తామరపూవు వంటి పాదమును నమస్కరించుచున్నాను- తిరునెడు-5) అను రీతిలో ఒక పాదముతో అధోలోకములను, వేఱొకపాదముతో ఊర్ధ్వలోకములను కొంచెను అని చెప్పబడగా, ఇచట **"త్రీణి పదా విచక్రమే"** (యజు అష్ట-2-4-5) మొదలగు పలు సందర్భములలో, **"మూన్ఱడి నిమిర్త్తు"** (పెరియాళ్వార్ తిరు-4-7-10) ఇత్యాదిగా పలు పాశురములలోను మూడు పాదములతో కొలిచినవాడని పల్కుట పొసగునా? అనినచో, ఈ సందేహమునుగూర్చియే నఞ్జీయర్ అను పూర్వాచార్యులు తమ ఆచార్యులగు పరాశరభట్టర్‌ను ప్రశ్నింపగా, **"పరో మాత్రయా తనువా వృధాన న తే మహిత్వ మన్వశ్నువంతి, ఉభే తే విద్మ రజసీ పృథివ్యాః విష్ణో దేవ త్వం పరమస్య విత్సే"** (యజు-అష్ట 2-8-16) (విష్ణుదేవా! మహానుభావుడవగు నీవు గొప్పది అగు నీ రూపముతో వృద్ధిచెందితివి. అపుడు నీ గొప్పతనమును ఇదమిత్థముగా పరిచ్ఛేదించి తెలిసికొనిన వారెవ్వరును లేరు. భూమిలో, ఆకాశములో నీవు పెట్టిన రెండు పాదములను మేము తెలియుదుము. దీనికిమించిన నీవు పెట్టిన మూడవపాదమునుగూర్చి నీవే తెలియుదువు సుమా) అనుచు వేదపురుషుడే "రెండు పాదములతో కొలుచుటను మేము అందఱము ఎఱుగుదుము. ఇక నీవు మూడు పాదములతో కొలుచుట నీకే తెలియవలెను'' అని కనుగొనలేక పల్కెను కదా. అందుచే అతడు మూడుపాదములతో కొలుచుటనుగూర్చి అతనికే తెలియవలెను" అనుచు భట్టర్ సమాధానమిచ్చిరట. **"ఉదారాః"** అని పల్కు స్వామి తన ఉల్లముతో భక్తుడగు మహాబలి తలపై పెట్టిన పాదమునే మూడవపాదముగా వేదపురుషుడు పల్కుచున్నాడు కాబోలు! భక్తుని తలను అధోలోకములతో, ఊర్ధ్వలోకములతో సాటివచ్చునని తలచువాడుకదా అతడు. **(తచ్ఛ్రోణైతి శ్రవ ఇచ్ఛమానా యజమానాయ)** - తనను ఆరాధించువానికి కీర్తి కలుగవలెనని కోరునదియై, ఆ పరమాత్మను శ్రవణానక్షత్రముయొక్క అధిదేవతయగు భూదేవి ఆశ్రయించుచున్నది. **''యజమానాయ''** అను పదమును

ముందువెనుకలలో అన్వయింపనగును. తన సంతానముపట్ల అంతులేని వాత్సల్యమును కల్గినది అగుటచే, జీవుడు కోరుకొనకున్నను, అది తన కార్యముగానే తలచికదా ఆదరముతో తానుగా ప్రయత్నించి, భగవానుని సన్నిధిలో పురుషకారమును చేయుచున్నది – అని భావము. లేక, **"శ్రవః ఇచ్ఛమానా"** అనుటకు హితమును ప్రార్థించునదియై,– అను అర్థమును చెప్పువారును కలరు.

**(పుణ్యం శ్లోకం యజమానాయ కృణ్వతీ ఏతి)** పరిశుద్ధమైన కీర్తిని తనను ఆరాధించువానికి కల్గించునదియై. పరమపురుషుని సేవించుచున్నది. ఈమె విషయములోని శరణాగతి ఫలపర్యవసాయి అగుచున్నదని భావము. **"శ్రూయతి ఇతి శ్రవః"** (అందఱిచే వినబడుచున్నది కావున కీర్తి శ్రవశ్శబ్దవాచ్యము) అను వ్యుత్పత్తినిబట్టి శ్రవశ్శబ్దము, **"శ్లోక్యత ఇతి శ్లోకః** (అందఱిచే పొగడబడుచున్నది కావున కీర్తి శ్లోక మనబడుచున్నది) అని శ్లోకశబ్దమును కీర్తివాచకములే. ఈ మంత్రముతో భూదేవియొక్క పురుషకారభావము ప్రకటితమైనది.

లోకములోని అందఱిచే తల్లి( భూమాత) గా పొగడబడు భూమికి అభిమాని దేవత అగు భూదేవిని వేదము ఏ విధముగా కీర్తించినదో భూసూక్తమువలన స్పష్టమగుచున్నది. ఈ భూమాతయొక్క నాథుడు ఎవడో, అతడే పరమపురుషుడు అనుట కింపునర్న్యాయసిద్ధము. **"జాతవేదః"** అనుచు గూఢముగా పల్కిన శ్రీసూక్తమువలెనే, ఈ భూసూక్తములోని ముందుభాగమునగల మంత్రములు **"పితా"** అని, **"అగ్నిః"** అని రహస్యముగా పల్కినను, ఉత్తరభాగములోని మంత్రములు **"విష్ణుపత్నీమ్"** అని, **"మాధవప్రియామ్"** అని, **"అచ్యుతవల్లభామ్"** అని, **"విష్ణు రురుగాయో విచక్రమే"** అనియును మిక్కిలి స్పష్టముగా ఈ అంశమును తెలిపినవి. శ్రీమన్నారాయణుడే భూమీనాథుడనుట దీనివలన కరబదరికాన్యాయసిద్ధము. ఈ వేదప్రసిద్ధిచేతనే లోకములో సైతము భూదేవీనాథుడు పురుషోత్తముడేనను ప్రసిద్ధి కల్గినది. ఇట్లు ఈ సూక్తముద్వారా లోకమాత అగు భూదేవియొక్క నాథుడైన శ్రీమన్నారాయణుడే పరతత్త్వమను పరమసత్యము సుస్పష్టముగా సుస్థాపితమైనది.

**వివృతి ర్భూమిసూక్తస్య ప్రణీతా -ంధ్యా మియం భవేత్ ।**
**శింగరార్యేణ మోదాయ సదసద్వేదినాం సతామ్ ॥**

